






# రేడియో నాటికలుగా బేతాళ కథలు

వజ్రోత్సవం జరుపుకుంటూన్న చందమామలో గత యాభైయేళ్ళకుపైగా ఆబాలగోపాలాన్ని అలరిస్తున్న బేతాళ కథలు ఇప్పుడు–వరల్డ్ స్పేస్ శాటలైట్ ఛానల్ నం. 107, రేడియో 'స్పందన'పై నాటికలుగా ప్రసారం కానున్నాయి.

ఆహ్లాదకరమైన కథల ద్వారా మానసిక విశ్లేషణతో, తర్కంతో, జీవితంలో ఎదురయ్యే రకరకాల ధర్మసందేహాలకు చక్కని సమాధానాలు తెలియజేసే నిత్యనూతనమైన బేతాళ కథలను ఇప్పుడు వీనుల విందుగా రేడియో నాటికలుగా 'స్పందన'లో విని ఆనందించండి!

**విజయదశమి నుంచి ఉదయం 8.30–9.00 గం.ల మధ్య ప్రసారం కానున్నది. ఆ తరవాత ప్రతి 2,4 ఆదివారాల్లో అదే సమయానికి ప్రసారమవుతాయి.**

వివరాలకు http://worldspace.msnserver.com/log on చేయవచ్చు.



SPANDANA

Website : www.worldspace.in

# నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను

**6-10 తరగతులలో చదువుతున్న విద్యార్థులకు అఖిలభారత పోటీ.**

బహుమతి పొందిన రచనలు-చిత్రాలు నూతన సంవత్సర సంచిక (జనవరి **2008**)లో వెలువడతాయి.

రచనలు : తెలుగులోనూ, చందమామ వెలువడే మిగతా 12 భాషలలోనూ పంపవచ్చు. కథ, వ్యాసం, అనుభవం, చూసిన ప్రదేశం మొదలైనవి ఏవైనా కావచ్చు. 300 పదాలకు మించకుండా ఉండాలి.

వర్ణచిత్రాలు : 15 X10 అంగుళాల సైజుకు మించకుండా ఉండాలి. కలర్ పెన్సిల్స్/క్రేయాన్/వాటర్ కలర్స్ ఉపయోగించవచ్చు.

బహుమతులు : ఉత్తమ రచనలకు రూ. 500లు చొప్పున 5 బహుమతులు ; ఉత్తమ వర్ణచిత్రాలకు రూ. 500లు చొప్పున 5 బహుమతులు ; రూ. 300 చొప్పున మూడు రచనలకు, మూడు వర్ణచిత్రాలకు ప్రోత్సాహక బహుమతులు.

అధిక బహుమతులను గెలుపొందే రచనలు-వర్ణచిత్రాలు పంపిన పాఠశాలకు ఒక కంప్యూటర్ కానుక!

**ఎంట్రీలను ధ్రువపరచి పాఠశాల ద్వారానే పంపాలి.**

**ఎంట్రీలు మాకు చేరవలసిన ఆఖరు తేది : 31 అక్టోబర్ 2007**

*సూచనలు :* ఎంట్రీలకు కింది కూపన్‌ను తప్పక జతపరచాలి. 2. కూపన్ ఫోటో కాపీ ఉపయోగించవచ్చు. 3. ఒక అభ్యర్థి 2 ఎంట్రీలను మాత్రమే పంపవచ్చు. 4. రచనలు సొంతదస్తూరీతోనే ఉండాలి. 5. చిత్రాలను మడతబెట్టి పంపకూడదు. 6. ఎంట్రీలను పోస్ట్/కొరియర్ ద్వారా మాత్రమే పంపాలి.

---

పేరు ______________________ వయసు ________ తరగతి ________

పాఠశాల ______________________

చిరునామా ______________________

______________________ పిన్ కోడ్ ________

ఇంటి చిరునామా ______________________

______________________ పిన్ కోడ్ ________

రచనల పేర్లు : 1. ____________ 2. ____________

వర్ణచిత్రాల పేర్లు : 1. ____________ 2. ____________

పైన కనబరచిన ఎంట్రీలను మా పాఠశాల విద్యార్థి ______________________ వేరెవరి సాయం లేకుండా సొంతంగా రాసినవి /వేసినవి అని ధ్రువపరుస్తున్నాం.

స్కూల్ స్టాంప్

ప్రధానోపాధ్యాయుడు/ప్రిన్సిపాల్



చందమామ సంపుటి: 60 అక్టోబర్ 2007 సంచిక: 10

## ఈ నెల విశేషాలు













## ఈ సంచికలో ...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

సూర్యుడు తామరలను వికసింప జేస్తాడు. చంద్రుడు కలువలను వికసింప జేస్తాడు. మేఘుడు అడగని వారికి కూడా నీరిస్తాడు. మంచి వాళ్ళు తమంత తామే పరోపకారానికి పూనుకుంటారు.







# హింస : ఓ వ్యాధి లక్షణం!

ఈనాటి ప్రపంచంలో అహింస మాటలకే పరిమితమైపోయి, మనసులు మాత్రం హింసలో కూరుకుపోయినట్టు కనిపిస్తోంది. నిజాయితీగా జీవించే జీవితంలోని హాయి తెలుసుకోలేని స్థితి; జీవితంలో ఉన్నత లక్ష్యంలేని ఓ వ్యాధి లక్షణమే హింస. మితి మించిన స్వార్థం, సాంస్కృతిక పతనం, సత్ప్రవర్తనకు ప్రాముఖ్యతలేని ధనార్జన ఒక్కటే పరమావధిగా సాగుతూన్న నేటి విద్యావిధానం మొదలైనవి కూడా ఆ వ్యాధి సూచకాలని చెప్పవచ్చు.

సామాజికసంస్కృతి పతనమైన వాతావరణంలోనే హింస మన కలుగుతుంది. హింసకు పరాకాష్ఠ ఇవాళ మనం అక్కడక్కడ అప్పుడప్పుడు చూస్తూన్న, అనుభవిస్తూన్న మతి లేని ఉగ్రవాద ఉన్మాదం. జనజీవనాన్ని విచ్ఛిన్నం చేయడానికి వివిధ స్వార్థశక్తులు పన్నాగాలు పన్నుతున్నాయి. ప్రగతి పథంలో సాగుతూన్న మనదేశాన్ని బలహీనపరచడానికి కొన్ని విదేశీ శక్తులు కుట్ర పన్నుతున్నట్టు తెలుస్తోంది. దానికి తోడు లాభాలు మాత్రమే గురిగా సినిమాలలో హింసనూ, రక్తపాతాన్నీ, అశ్లీలతనూ గుప్పిస్తున్నారు. టీవీ ఛానళ్ళలో, వెబ్‌సైట్లలో వాటిని మాటి మాటికీ ప్రసారం చేస్తున్నారు. మాదక ద్రవ్యాలు మరోవైపు యువతను నిర్వీర్యం చేసి తప్పుదారి పట్టిస్తున్నాయి.

ఇవన్నీ మారాలంటే మొదట విద్యావిధానం పట్ల మనకున్న దృక్పథం మారాలి. మాధ్యమాల దుర్వినియోగాన్ని నియంత్రించాలి. మాదక ద్రవ్యాలను రూపు మాపాలి. కేవలం ఉపన్యాసాలు, చట్టాలు, పోలీసుబలగం హింసాత్మక కార్యకలాపాలను అరికట్టలేవు. చైతన్యవంతమైన సమాజం మాత్రమే వీటన్నిటికీ చరమగీతం పాడగలదు. గాంధీజయంతిని అంతర్జాతీయ అహింసాదినోత్సవంగా జరుపుకుంటూన్న ఈ సందర్భంలో మనం ప్రతి ఒక్కరం మనవంతు కర్తవ్యాన్ని నెరవేర్చాలని ప్రతినబూనాలి. తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల ప్రోత్సాహంతో సంస్కారవంతులు, ధైర్యవంతులు కావాలని పిల్లలు సంకల్పించినట్టయితే పరిస్థితిలో గణనీయమైన మార్పు వచ్చి తీరుతుంది.

సంపాదకుడు : **విశ్వం**

Visit us at : http://www.chandamama.org





చందమామ

చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా
రూ.180.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్
ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.

**ఉత్తమ లేఖకు బహుమతి!**
అక్టోబర్ సంచిక నుంచి 'పాఠకుల లేఖలు' శీర్షికలో ప్రచురించబడే ఉత్తమ లేఖకు రూ. 250/- బహుమతి అందజేస్తున్నాం. చందమామలో వెలువడే కథలు, శీర్షికల గురించి పాఠకుల నిర్మాణాత్మక విమర్శలనూ, విలువైన సలహాలనూ ఆహ్వానిస్తున్నాం. -సం.

**SUBSCRIPTION**
**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of***
***Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
**CHANDAMAMA INDIA LIMITED**
**82, Defence Officers Colony**
**Ekkatuthangal,**
**Chennai - 600 032**
**E-mail :**
**subscription@chandamama.org**



# పాఠకుల లేఖలు

## రూ. 250/- బహుమతి పొందిన లేఖ

చందమామకు సలహాలివ్వడం అంటే సాహసమే. అయినా పాఠకుడిగా పాతికేళ్ళ వయసున్న నేను చంద్రునికోనూలు పోగు చందంగా రాస్తున్నాను. ఆగస్ట్ సంచిక ఆసాంతం ఆకట్టు కుంది. ప్రియనేస్తంలా, చల్లదనాల జాబిలిలా మనసును పులకింప జేసింది. మరీ ముఖ్యంగా చందమామ గురించి జాతియావత్తూ గర్వించదగ్గ పెద్దలు వ్యక్తీకరించిన మనోభావాలు అమూల్య సంప దలే. అలాగే విశ్వంగారి సంపాదకీయంలో ''అవకాశాలను అంది పుచ్చుకుని అభ్యుదయ పథంలో ముందుకు సాగుతూ, వెనక వస్తూన్న వారికి సైతం చేయూతనివ్వాలి,'' అన్న సుభాషితం చాలు... చందమామ పత్రిక ప్రపంచ పురోగతికి ఎంత పాటుపడుతుందో తెలుసుకోవడానికి. 25-ఏళ్ళ నాటి చందమామ కథ 'మర్యా దయిన పద్ధతి' ప్రతి అల్పవిషయాన్నీ భూతద్దంలో చూసి లేనిపోని రాద్ధాంతాలకు పోయేవారికి చెంపపెట్టు. దొంగను దేవుడిగా ప్రచారం చేసి అతని వైఖరిలో శాశ్వత మార్పు తీసుకురావడం హర్షణీయం. కథల పరంగా మావంటి కొత్త వారిని కూడా ప్రోత్సహించండి. హెచ్చు తగ్గులు ఎరుగని పూర్ణబింబంలా మన చందమామ కలకాలం 'తేట తెలుగు భాషాధారలను తేనెల జల్లులా జాలువార్చాలని' మనసారా కోరుకుంటున్నాను.

-డా. జి. జాన్ కెనడి, హైదరాబాద్-500 013

ఒత్తిడి లేని స్కూలు చదువులూ, సాయంకాలాల్లో దేశవాళీ క్రీడలూ, రాత్రిళ్ళు బామ్మ చెప్పేకథలూ, ప్రతినెలా చందమామ పుస్తకం కోసం ఎదురుచూపులూ-ఇదీ యాభై ఏళ్ళ క్రితంనాటి 'బాల్యం.' బండెడు పుస్తకాలతో మమ్మీ డాడీ స్కూళ్ళలో కుస్తీపట్టటం, అదనంగా సాయంకాలాల్లో ట్యూషన్లూ, రాత్రిళ్ళు జెటిక్స్, కార్టూన్ సీరియళ్ళ మత్తులో మునగటం-ఇదీ నేటి 'బాల్యం.' ప్రపంచీకరణ నేపథ్యంలో పిల్లలు అంతర్జాతీయ స్థాయికి ఎదగవలసిన ఆవశ్యకత ఉన్నా, ఈ ఎదుగుదలలో వారి వ్యక్తిత్వాలు భారతీయ సంస్కృతీ సంప్రదా యాల సుగంధాన్ని అద్దుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇందుకు వారికి అందుబాటులో ఉన్న అతి సులభమైన మార్గం-క్రమం తప్పకుండా 'చందమామ'ను చదవటం!

-కె. శివకుమార్, ఒంగోలు-523 002




# మంజరీదేవి

ఉదయగిరి రాజు భానుప్రతాపుడు చండ శాసనుడు. భయం వుంటే తప్ప మనిషి సక్రమ మార్గంలో నడవడనే దృఢ అభిప్రాయం కల వాడు. అందువల్ల చిల్లరమల్లర నేరాలకు కూడా కఠినమైన శిక్షలు విధించేవాడు. నేరాన్ని బట్టి మరణశిక్షలు విధించడానికి కూడా వెనుకాడేవాడుకాడు. రాజ్యం ప్రశాంతంగా ఉన్నప్పటికీ మామూలు ప్రజలు భయం భయంగా కాలం గడిపేవారు.

భానుప్రతాపుడి ఏకైక కుమార్తె మంజరీ దేవి క్షత్రియోచిత విద్యలనభ్యసించింది. హఠాత్తుగా అనారోగ్యం పాలైన రాజు, యుక్త వయస్కురాలైన మంజరీదేవికి రాజ్య పట్టా భిషేకం చేయించి, పాలనా బాధ్యతలు అప్పగిం చాడు. వృద్ధమంత్రి భైరవామాత్యుల సలహా లతో కుశాగ్రబుద్ధి అయిన మంజరీదేవి అచిర కాలంలోనే పాలనా వ్యవహారాలలో దక్షత సంతరించుకున్నది.

కుమార్తె శక్తి సామర్థ్యాలు భానుప్రతాపు డికి ఆనందాన్నిచ్చాయి. స్త్రీ అయినప్పటికీ ఆమె సమర్థవంతంగా రాజ్య పాలన చేయగల దన్న సంతృప్తితో ఆయన ప్రశాంతంగా కన్నుమూశాడు. తండ్రి మరణం మంజరీ దేవికి తీవ్రమనస్తాపం కలిగించింది. ''ఇటు వంటి విషాద పరిస్థితులలోనే గుండెదిటవు చేసుకోవాలి,'' అంటూ మంత్రి భైరవామా త్యులు మంచి మాటలతో ఆమెకు ధైర్యం నూరిపోశాడు. తండ్రిలాంటి మంత్రి ఓదార్పు కారణంగా మంజరీదేవి త్వరలోనే విషాదం నుంచి బయటపడి పాలనా వ్యవహారాలలో నిమగ్నురాలయింది.

భైరవామాత్యులు ఒకసారి పొరుగు రాజుతో ఏవో వ్యాపార సంబంధాల గురించి మంత నాలు జరపడానికివెళ్ళాడు. ఆ సమయంలో మంజరీదేవి వినోదార్థం పరివారంతో అడవికి వేటకు వెళ్ళింది. ఆమె మృగాలను గురిపెట్టి

యస్.డి.వి. అజీజ్



వదిలే బాణాలు, వాటి వేగం చూసి సైనికులు అబ్బుర పడ్డారు. అలా వేటాడుతూ క్రమంగా ఆమె తమ సైనికుల నుంచి వేరు పడి అడవిలోకి వెళ్ళింది.

చాలాసేపు వేటాడిన తరవాత మంజరీదేవి కొలను దాపులనున్న ఒక చెట్టు కింద కూర్చున్నది. అప్పుడు చెట్టు చాటు నుంచి ఒక యువకుడు ఆమెను చూసి, ఆమె అద్భుత సౌందర్యానికి ముగ్ధుడై, మరింత దగ్గరికి వెళ్ళి చూద్దామనుకుంటూండగా, కొందరు సైనికులు అక్కడికి రావడం గమనించి వెనక్కు తగ్గాడు. చెట్ల చాటునుంచి లేచి వెళ్ళేంత వరకు ఆమెను చూస్తూ ఉండిపోయాడు.

ఆ యువకుడు ఒక చిత్రకారుడు. పేరు ముకుందుడు. ఒక ఊళ్ళో నిలకడగా ఉండకుండా దేశసంచారం చేస్తూ ఉంటాడు. దేవాలయాల గోడలపై దేవతామూర్తుల చిత్రాలు చిత్రించడంలోనూ; పక్షులను, జంతువులనూ, మనుషులనూ చూసి అలాగే చిత్రించడంలోనూ సిద్ధహస్తుడు. చిత్రలేఖనానికి కావలసిన పసరుల ఆకులూ, పళ్ళూ, కాయలూ సేకరించడానికి అడవికి వచ్చి రాణిగారిని చూశాడు.

పసరు ఆకులతో సమీప గ్రామం చేరిన ముకుందుడి కళ్ళ ముందు మంజరీదేవి రూపమే కదలాడసాగింది. ఆమెను మళ్ళీ ఒకసారి చూసి, ఆమెరూపం చిత్రించాలని అతడి మనసు తపించింది. తాను తిరిగి వస్తూన్నప్పుడు, మార్గ మధ్యంలో ఏటిగట్టున కొందరు సైనికులు గుడారాలు నిర్మిస్తూండడం ముకుందుడు చూశాడు. వేట ముగించుకుని రాణిగారు రాత్రికి అక్కడే బసచేయనున్నట్టు వాళ్ళు మాట్లాడుకోవడం కూడా విన్నాడు. అది రాణిగారిని చూడడానికి చక్కని అవకాశం అనుకుని, ముకుందుడు అప్పటికప్పుడే బయలుదేరాడు.

సైనికులు గుడారాలు ఏర్పాటు చేసిన చోటికి చేరేసరికి బాగా పొద్దుపోయింది. ఆ సమయంలో వెళితే కాపలాభటులు అనుమతించరన్న అనుమానంతో దూరంగా కాచుక్కూర్చున్నాడు. అర్ధరాత్రి సమయంలో కాపలాభటుల కన్ను గప్పి, గుడారంలోకి ప్రవేశించి, చుట్టూ చెలికత్తెల మధ్య, వేటాడిన అలసటతో ఆదమరచి నిద్రపోతూన్న మంజరీదేవిని తదేక దృష్టితో కొంతసేపు చూశాడు. ఇక ఆమె చిత్రం చిత్రించగలననుకుని వెనుదిరిగి

వస్తూన్న సమయంలో కాపలా భటులు అతణ్ణి చూసి పట్టి బంధించారు.

మరునాడు రాజధానికి చేరిన మంజరీదేవి సమక్షానికి, బందీగా ఉన్న ముకుందుణ్ణి తెచ్చి నిలబెట్టారు. ఆ సమయంలో భైరవామాత్యులు సభలో లేరు గనక సేనాధిపతి- అర్ధరాత్రి సమయంలో వచ్చిన అతడు శత్రు దేశపు గూఢచారి కావచ్చుననీ, అతడికి శిరశ్ఛేదమే సరైన శిక్ష అనీ రాణిగారికి విజ్ఞప్తి చేశాడు.

ఆమె ముకుందుడి కేసి చూసింది.

'నేనొక చిత్రకారుణ్ణి. వేటాడుతున్నప్పుడు మిమ్మల్ని చూసిన నేను, మీ చిత్రపటాన్ని చిత్రించాలన్న ఆసక్తితో మిమ్మల్ని చూడడానికి వచ్చానే తప్ప, నాకెలాంటి దురుద్దేశమూ లేదు,'' అన్నాడు ముకుందుడు.

''అనుమతి లేకుండా అర్ధరాత్రి సమయంలో మహారాణి నిద్రిస్తూన్న గుడారంలో ప్రవేశించడం మహాపరాధం. కారణమేదైనా, మన రాజ్య శాసనం ప్రకారం అతడికి మరణ దండన విధించాలని మనవి చేస్తున్నాను,'' అన్నాడు సేనాధిపతి.

సభలోని ప్రముఖులు కూడా మరణ దండనే సరైన శిక్ష అని అభిప్రాయపడడంతో మంజరీదేవి, ''అనుమతి లేకుండా కాపలా భటుల కన్ను కప్పి ప్రవేశించినందుకు మరణ దండన విధిస్తున్నాను. రేపు సూర్యోదయానికల్లా ఇతన్ని ఉరితీయండి,'' అని ఆజ్ఞాపించింది.

ముకుందుణ్ణి చెరసాలకు నడిపించేందుకు భటులు ముందుకు రాగానే, అతడు మహారాణికేసి చూస్తూ, ''అనుమతిలేకుండా



అపరాత్రి వేళ నేను అక్కడికి రావడం నేరమే. మరణదండన అమలుపరచండి. కాని ఒక్క కోరిక,'' అన్నాడు.

''ఏమిటది?'' అని అడిగింది రాణి.

''తమ చిత్రం గీయాలన్నది నా వాంఛ. వారంలో పూర్తి చేస్తాను. ఆ తరవాత నిరభ్యంతరంగా శిక్ష అమలు పరచండి. నా చివరి కోరికను కాదనకండి,'' అని వేడుకున్నాడు ముకుందుడు.

క్షణకాలం ఆలోచనలో పడ్డ రాణి తలపంకించి, ''సరే, ఒకవారం గడువిస్తున్నాను. ఈలోగా చిత్రం పూర్తయినా, కాకున్నా రాబోయే శుక్రవారం ఉదయం నీకు మరణశిక్ష ఖాయం,'' అన్నది.

ముకుందుడి అభ్యర్థన మేరకు చిత్రలేఖనానికి కావలసిన రంగులు, కుంచెలు, ఇతర

సామగ్రి చెరసాల గదిలోనే సమకూర్చ బడ్డాయి. వారం రోజులు గడిచి పోయింది. చివరి రోజురాత్రి ముకుందుడు తాను గీసిన మంజరీదేవి తైలవర్ణ చిత్రపటాన్ని ఆమె మందిరానికి పంపాడు.

మరునాడు తెల్లవారగానే తన చిత్రపటాన్ని చూసి మంజరీదేవి ఆనందాశ్చర్యాలు పొందింది. తన రూపులేఖలను ఇంత హృద్యంగా చిత్రించిన ముకుందుడికి తానే మరణ శిక్ష విధించడమా? అన్న ఆలోచనలో పడింది. భటులను పిలిచి, ''మరణ దండన ఆపి, ముకుందుణ్ణి ఇక్కడికి తీసుకురండి,'' అని ఆజ్ఞాపించింది.

అప్పటికే భటులు ముకుందుణ్ణి వధ్య భూమికి తీసుకువెళ్ళారు. శిక్ష నెరవేరనున్న క్షణంలో సైనికులు హుటాహుటిగా వెళ్ళి, రాణిగారి ఆజ్ఞను తెలియ జేసి శిక్షను ఆపారు. ముకుందుణ్ణి రాణిగారి సమక్షానికి వెంట బెట్టుకు వచ్చారు.

అప్పుడే పొరుగుదేశానికివెళ్ళి తిరిగి వచ్చిన ప్రధాని భైరవామాత్యులు జరిగిన సంగతి తెలుసుకుని, ''మరణశిక్ష ఏకాలంలో ఏర్పడిందో ఏమోగాని, మహాదారుణమైనది. దాని వల్ల మేలు కన్నా కీడే ఎక్కువ జరుగుతుంది. కొద్దిపాటి ఆలస్యం జరిగి ఉంటే అపురూప కళాకారుడి నిండు ప్రాణాలు గాలిలో కలిసి పోయి ఉండేవి. ఎలాంటి తప్పు చేసినా ఎదుటి వారి ప్రాణాలు తీసే హక్కు ఎంతటి వారికైనా ఉండకూడదు. చేతనైతే మనిషికి ప్రాణాలు పొయ్యాలేగాని, తీయకూడదు,'' అన్నాడు.

''అవును, అమాత్యవర్యా! ఈ క్షణం నుంచే ఉదయగిరి రాజ్యంలో మరణశిక్షను రద్దు చేస్తున్నాను,'' అన్నది మంజరీదేవి.

భైరవామాత్యులు మందహాసం చేస్తూ ఆమెను అభినందించాడు.

''అంతేకాదు. ముకుందుణ్ణి మన ఆస్థాన చిత్రకారుడిగా నియమిస్తున్నాను,'' అన్నదామె ముకుందుడి కేసి అభినందన పూర్వకంగా చూస్తూ.

సభికుల కరతాళ ధ్వనులతో సభాప్రాంగణం మారుమోగింది.





# అగ్నిప్రవేశం!

పెనుగొల్లు గ్రామాన్ని ఆనుకుని పారే ఏటికి అవతలి ఒడ్డున ఒక పెద్ద మర్రిచెట్టు, రావి చెట్టు ఉండేవి. రావిచెట్టు కింద ప్రేమానం దుడు అనే సాధువు ఇద్దరు శిష్యులతో ఉండే వాడు. రకరకాల సమస్యలతో తన దగ్గరికి వచ్చే భక్తులకు ఆయన తగిన సలహాలు ఇస్తూ ధైర్యం చెప్పి పంపేవాడు. చిల్లర మల్లర వ్యాధు లతో వచ్చే పేదసాదలకు వనమూలికలతో తయారు చేసిన మందులు ఇచ్చేవాడు.

ఆ ఊరికి ఒకనాడు కాలయోగి అనే మరొక సాధువు నలుగురు శిష్యులతో వచ్చాడు. ఆ ఊరిపెద్ద రమణయ్యకు సాధుసన్యాసులంటే ఎనలేని గౌరవం. ఆయన కాలయోగికి తన తోటలో బస ఏర్పాటు చేశాడు. కాలయోగి తన వద్దకు వచ్చే భక్తులకు వట్టి చేతులతో విభూతి సృష్టించి ఇస్తూ, "ఈ విభూతి అద్భుత శక్తితో మీ బాధలన్నీ పటాపంచలై పోతాయి. హిమాలయాలలో పన్నెండేళ్ళు కఠోర యోగసాధన చేసి ఇలాంటి మహిమ లను సాధించాను. అయితే, ఏటి గట్టున ఉన్న ప్రేమానందుడికి ఒక్క మహిమా చేతకాదు. బహుశా ఉదర పోషణకు అతడు కాషాయాం బరాలు ధరించాడని నా అనుమానం," అనే వాడు హేళనగా.

ఇది విన్న భక్తులు బాధపడేవారు. ప్రేమా నందుడంటే గౌరవ మర్యాదలుగల రమ ణయ్యకు ఇది మరింత బాధ కలిగించింది. ఆయన కొందరు గ్రామస్థులతో కలిసి ప్రేమా నందుడి వద్దకు వెళ్ళి సంగతి చెప్పాడు.

అంతా విన్న ప్రేమానందుడు, "ఇలాంటి యోగిపుంగవుల రాకకోసమే ఎదురుచూస్తు న్నాను. వచ్చే ఏకాదశి రోజున మీ తోటలో పెద్ద యజ్ఞకుండం ఏర్పాటు చేయించు. ఏకాదశ రుద్రహోమం చేద్దాం. పూర్ణాహుతి ముగిశాక పవిత్ర హృదయులైన యోగులు అందులో ప్రవేశిస్తే, వాళ్ళు ద్విగుణీకృత తేజస్సుతో,

ఎన్.వి.ఆర్. సత్యనారాయణ మూర్తి

మరిన్ని శక్తులతో వెలుపలికి రాగలరు. అది మానవాళికి మేలు చేస్తుంది. ఆ సంగతి సర్వజ్ఞులైన కాలయోగికి తప్పక తెలిసే ఉంటుంది. ఆ యజ్ఞకుండంలో మహిమాన్వితులైన కాలయోగి మొదట ప్రవేశిస్తే, నేను ఆయన వెంట నా శిష్యులతో ప్రవేశిస్తాను. ఈ విషయం వారికి విన్నవించు,'' అన్నాడు.

ఆ సంగతి ఈనోటా ఆనోటా పడి ఊళ్ళో అందరికీ తెలిసిపోయింది. రమణయ్య ఆ విషయం చెప్పగానే కాలయోగి, ''అలాగే! ఏకాదశికి ఇంకా రెండు రోజులున్నాయి కదా,'' అన్నాడు.

మరునాడు తెల్లవారగానే తోటకాపు వచ్చి, రమణయ్యతో, ''అయ్యా, తోటలోని కాలయోగి కనిపించడం లేదు,'' అన్నాడు.

''చుట్టుపక్కల వెదికి చూడు. యోగి కదా! ప్రశాంత ప్రదేశంలో ఉండవచ్చు,'' అన్నాడు రమణయ్య.

''లేదయ్యా. అక్కడ వారి వస్తువులేవీ కనిపించడం లేదు,'' అన్నాడు కాపలావాడు.

రమణయ్య అప్పటికప్పుడే ప్రేమానందుడి వద్దకు వెళ్ళి సంగతి చెప్పాడు. ప్రేమానందుడు మందహాసం చేస్తూ, ''అవును నాయనా! ఎవరూ కోరి ప్రాణాల మీదికి తెచ్చుకోరుకదా? ప్రాణ భీతితో పారిపోయి ఉంటాడు. కాలయోగి కబుర్లతో, తాను నేర్చుకున్న ఇంద్రజాల విద్యతో అందరినీ బుట్టలో పెట్టి కాలక్షేపం చేసేరకం. నిర్మలమైన మనస్సు ఉంటే తప్ప యోగికాలేడు. నిర్మల మనస్కుడికి అహంకారం, పరదూషణ ఉండవు. అందువల్లే అతడు కపటయోగి అని గ్రహించి, ఈ అగ్నిప్రవేశ నాటకం ఆడాను. నిజానికి అది అతనికి అగ్నిపరీక్ష! అయినా, యజ్ఞ యాగాలతో, మహిమలతో ప్రయోజనాలు ఉండవచ్చేమోగాని, మనిషికి వాటికన్నా ముఖ్యమైనది సాటి మనుషుల మీద ప్రేమానురాగాలతో మసలుకోవడం; సాయ పడడం. పరస్పర సహకారంతో అందరూ కలిసికట్టుగా కృషి చేస్తే మన గ్రామమే కాదు; మన దేశం, ఆ మాటకొస్తే భూప్రపంచమే సుఖసంతోషాలతో పరిఢవిల్లుతుంది,'' అన్నాడు.

రమణయ్య ప్రేమానందుడి సలహాను ఆచరణలో పెట్టడానికి అక్కడి నుంచి సంతోషంగా బయలుదేరాడు.






# రాకాసిలోయ

## 26

[బిడాలి, శ్వానకర్ణి ముఠాలకు రాజీ కుదిర్చేందుకు జయమల్లు చేసిన ప్రయత్నం ఫలించలేదు. శ్వానకర్ణి ముఠావాళ్ళ మూలపురుషుడి రాతి గద నిప్పులు కక్కే సింహం గుహలో వున్నదని బిడాలి చెప్పాడు. అది అక్కడే ఉన్నదని నిర్ధారించుకున్నాక ఆ గద తెచ్చేందుకు కేశవుడూ, అతడి స్నేహితులూ మడుగును తెప్పతో దాటి సింహం గుహను సమీపించి, లోపలికి తొంగి చూశారు. -తరవాత]

గుహలోపలి భాగం ఏమంత చీకటిగా లేదు. ఎక్కడినుంచో వెలుగు దానిలోకి పడుతున్నది. ఆ గుడ్డి వెలుగులో, అందరి కన్న ముందు నిలబడి గుహలోపలికి తొంగి చూసిన కేశవుడికి, ఏవో నిప్పు రవ్వలు లేచి చెల్లా చెదరైనట్టు కనిపించింది.

''నిజంగా, గుహావాసులు చెప్పినట్టు లోపల వున్నది నిప్పులు కక్కే సింహమే అయితే, అది మన బాణం వేటు దూరం లోనే వున్నది,'' అంటూ కేశవుడు తన అనుచరుల కేసి చూశాడు. ఈలోపల జయమల్లూ, కోయగోమాంగ్ కూడా గుహలో రేగిన నిప్పురవ్వలను గమనించారు.

''మనం సింహాన్ని బయటికి వచ్చేట్టు చేయాలి. అలా చేయగలిగామో దాన్ని చంపటం తేలిక. అలా కాక, మనం గుహలో ప్రవేశించటం ఏమంత క్షేమం కాదు,'' అన్నాడు జయమల్లు.

'చందమామ'



జయమల్లు ఇలా అంటూ వుండగానే, కోయగోమాంగ్ గుహముందున్న ఒక పెద్ద రాయి తీసుకుని బలంగా గుహలోకి విసురుతూ, 'ఏహోయ్!' అంటూ బిగ్గరగా అరిచాడు. ఆ ధ్వని గుహలో మారుమోగింది. ఆ వెంటనే లోపల నిప్పురవ్వలు చేటలతో చెరిగినట్టు లేచినై. కేశవుడు చప్పున బాణం ఎక్కుపెట్టి సూటిగా గుహలోకి వదులుతూ, "సింహం మన మీదికి దూకేందుకు వస్తున్నది," అంటూ హెచ్చరించాడు. కాని, మరుక్షణం గుహను నిశ్శబ్దం ఆవరించింది. నిప్పు రవ్వల కాంతి మాయమయింది.

"సింహం మనను చూసి బెదురుకుని పారిపోయింది. సందేహం లేదు," అన్నాడు కోయగోమాంగ్.

"ఇక మనం గుహలోకి జొరబడి దాన్ని వెంటబడి తరిమి వేటాడటమే మార్గం, ఏమంటావ్, జయమల్లూ?" అని ప్రశ్నించాడు కేశవుడు.

జయమల్లు గుహలోపలికి రెండడుగులు వేసి ఆగి, "గుహావాసులు చెప్పినంత భయంకర జంతువేమీ కాదు, ఈ సింహం! పోతే, తతిమ్మా సింహాల్లో లేని ప్రత్యేకత దీనికొకటి వుంది. అది, ముక్కుల్లో నుంచో, నోట్లో నుంచో నిప్పురవ్వలు రాల్చటం. అది చూసే గుహావాసులు అంత భయపడి పోయారు. సరే, జాగ్రత్తగా నడవండి. మనం వదిలే మూడు విష బాణాల్లో ఏ ఒక్కటి తగిలినా సింహం చచ్చినదాని కిందే లెక్క. అంతేనా గోమాంగ్?" అన్నాడు.

"ఆ విషం సంగతి నాకు బాగా తెలుసు. నీకెలాంటి సంశయం అక్కరలేదు," అన్నాడు కోయగోమాంగ్ నమ్మకంగా.

ముగ్గురూ గుహ ప్రవేశించి ముందుకు నడవసాగారు. కొంత దూరం లోపలికి పోయేసరికి, వాళ్ళకు గుహ రెండు మూడు భాగాలుగా చీలి పోవటం కనిపించింది. అంతా వెలుగుగానే వున్నది. కాని, ఎక్కడా సింహం జాడలేదు.

"మళ్ళీ తిరిగి మనం గుహా కందరాల్లో పడ్డాం. ఏదారి ఎటు పోతుందో చెప్పలేం. సింహం, ఈ మార్గాల్లో దేనివెంట పారిపోయినట్టు?" అన్నాడు కేశవుడు.

కోయగోమాంగ్ మోకాళ్ళ మీద పాకుతూ గుహ చీలికలైన ప్రదేశాన్ని జాగ్రత్తగా పరీక్షించి చూసి, "సింహం, ఇదుగో, ఈ కుడివైపు సొరంగ మార్గాన పోయింది. ఇక కదలండి," అంటూ బయలుదేరాడు.

జయమల్లు అతడి భుజం పట్టుకుని ఆపుతూ, ''గోమాంగ్, తొందరపడకు. నువ్వన్నట్టు సింహం ఆ మార్గానే పోయినా, అది ఏ మలుపో తిరిగి, వెనక్కు వచ్చి, మన మీద హఠాత్తుగా దూకవచ్చు. ఆ సంగతి ఆలోచించావా?'' అన్నాడు.

జయమల్లు ఇలా అనగానే, గోమాంగ్ ఆశ్చర్యం కనబరుస్తూ, ''అవును, జయమల్లూ, నువ్వన్నది నిజమే. మనలో ఒకళ్ళు వెన్ను కాస్తూ వెనక్కు నడవటం మంచిది. అప్పుడు సింహం మన మీద దొంగదెబ్బ తీయలేదు,'' అన్నాడు.

జయమల్లూ, గోమాంగ్ ముందు నడుస్తూండగా, కేశవుడు వెనక్కు తిరిగి నడుస్తూ వాళ్ళను అనుసరించాడు. ఆ విధంగా వాళ్ళు గుహమార్గాల వెంట కొంతదూరం నడిచేసరికి హఠాత్తుగా గోమాంగ్, చిన్న కేక వేసి, ''చూడండి! ఇదిగో, మనిషి పుర్రె. బహుశా ఇది బిడాలి ముఠావాడైన భాగ్‌మారా దయివుంటుంది. వాడే గదా శ్వానకర్ణి వాళ్ళ గద తీసుకుని ఈ గుహలోకి ప్రవేశించింది,'' అన్నాడు.

జయమల్లు చటుక్కున ఆగి, అంత దూరంలో వున్న పుర్రెను చేతికి తీసుకుని అటూ ఇటూ తిప్పి పరీక్షించి చూసి, ''గోమాంగ్, నువ్వన్నట్టు ఇది భాగ్‌మారాదే కావచ్చు. అలా అయినప్పుడు ఆ రాతి గద కూడా ఈ దాపులనే ఎక్కడో వుంటుంది,'' అన్నాడు.

ముగ్గురూ సొరంగ మార్గంలో గద కోసం వెతకసాగారు. కేశవుడు వికటంగా నవ్వుతూ,



ఒక మూల నుంచి దాదాపు నాలుగడుగుల పొడవున్న దృఢమైన ఒక రాతి ముక్కను, చివర గుండ్రంగా రాతి ముళ్ళతో వున్న దానిని పైకెత్తి, ''ఇదేనా, అద్భుత శక్తులున్న శ్వానకర్ణి మూలపురుషుడి గద!'' అన్నాడు.

జయమల్లు ఆ రాతి ముక్కను పరీక్షించి చూసి, ''ఇది రాతి గద అనే దాంట్లో సందేహం ఏమీ లేదు. అద్భుత శక్తుల మాట ఆ గుహావాసులకే తెలియాలి! సరే, వచ్చిన పని అయింది. ఇకబయటపడదామా?'' అన్నాడు.

''సింహం మాటేమిటి?'' అని అడిగాడు కేశవుడు.

''అవును, దాన్ని చంపుతామని మాట ఇచ్చాంగదా, చంపకుండా ఎలా పోవటం?'' అన్నాడు కోయగోమాంగ్.

జయమల్లు చిరునవ్వు నవ్వుతూ రాతి గదను కోయగోమాంగ్ చేతి కిచ్చి, ''మనం

సింహాన్ని చంపుతామని ఎవరికీ వాగ్దానం చెయ్యలేదు. రాతి గదను శ్యానకర్ణికి తెచ్చి ఇస్తామని చెప్పాం. ఆ పని పూర్తయింది. సింహం సంగతి మనకెందుకు? అది ఎంత భయంకర మృగమో కూడా మనకు తెలియదు. అనవసరంగా దుస్సాహసం చెయ్యటం అంత వివేకం కాదు, కదా,'' అంటూ కేశవుడి కేసి తిరిగాడు.

జయమల్లు అన్నదానికి కేశవుడు ఏదో జవాబు చెప్పబోయేంతలో, కోయగోమాంగ్ ఎగిరి గంతేసి, ''నిప్పులు కక్కే సింహం! బాణాలు ఎక్కుపెట్టండి,'' అంటూ రాతి గదను పైకెత్తాడు.

సింహం హఠాత్తుగా ఒక మలువు తిరిగి భయంకరంగా గర్జిస్తూ ముందుకు దూకింది. జయమల్లూ, కేశవుడూ బాణాలు ఎక్కుపెట్టే లోపల గోమాంగ్ తన చేతిలో వున్న రాతి గదతో, దాని తల మీద గట్టిగా ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బ తింటూనే సింహం చెంగున వెనుదిరిగి పరిగెత్తసాగింది. కేశవుడూ, జయమల్లూ వదిలిన బాణాలు దానికి తగలలేదు.

''దీనికి సింహమని ఎవరు పేరు పెట్టారో గాని, ఇది సింహం కాదు; మా కోయవాళ్ళు దీన్ని సింహాలీకమంటారు. మా కొండప్రాంతాల కూడా ఇవి వున్నవి. దాని ముక్కు నుంచి వెలువడే రవ్వల్లో కాంతి వుంటుంది తప్ప, వేడిమి వుండదు,'' అన్నాడు కోయగోమాంగ్.

''దాని మెడా, మూతీ చూసిన వాడెవడూ అది అసలు సింహపు జాతి జంతువంటేనే నమ్మడు. పైగా, వట్టి పిరికి గొడ్డులా వున్నది. అయినా, ఈ వర్ణనంతా ఇప్పుడెందుకు. ఎదురయింది గనక, దాని అంతు తేల్చుదాం,'' అంటూ జయమల్లు ముందుకు వేగంగా పరిగెత్తాడు.



సింహం గుహ మార్గాన కొంత దూరం సూటిగా పరిగెత్తి, ఒక మలువు తిరిగింది. జయమల్లు మలుపు సమీపిస్తూనే వేగం తగ్గించి, ముందుకు తొంగి చూసి పెద్దగా నవ్వుతూ, "ఇదేదో మన కోసం ఇక్కడ పొంచి వుంటుందని భయపడ్డాను. కాని, అంతు లేకుండా పారిపోయింది. ఇప్పుడేమిటి చేయటం?" అన్నాడు.

కేశవుడూ, కోయగోమాంగ్‌లు జయ మల్లును సమీపించి, ముందున్న సొరంగం కేసి చూశారు. గోమాంగ్ రాతి గదను రెండు చేతులతో పట్టుకుని పైకెత్తి అటూ ఇటూ ఊపుతూ, "దీనిలో ఏదో అద్భుత శక్తి వున్నది, సందేహం లేదు. ఒక్కదెబ్బకే ఆ సింహాలీకం ఎంత బెదిరి పోయిందో చూశారు గదా?" అన్నాడు.

"ఇక వెనక్కు తిరిగి పోవటమే మంచి దేమో," అన్నాడు జయమల్లు.

"ఇంత శ్రమపడి వూరికే పోవటం ఎందుకు. ఆ సింహాన్ని చంపి దాని చర్మం వలుచుకు పోదాం," అన్నాడు కేశవుడు. ముగ్గురూ గుహ మార్గం వెంట నడవసాగారు. కాని ఎక్కడా సింహం జాడ లేదు. అది మరే గుహామార్గం లోనో దాక్కుని వుంటుందని వాళ్ళు భావిం చారు. కాని, ఇన్ని సొరంగపు బాటల్లో దాన్ని వెతికి చంపటం ఎలా? జయమల్లు వెనక్కు తిరిగి నడవబోయిన వాడల్లా చప్పున ఆగి, "మనం వచ్చిన మార్గానే తిరిగి నీటి మడుగు దగ్గిరకు వెళ్ళేందుకు, దారి మీకు గుర్తుందా? లోగడ మనం గుహా కందరాల్లో దారి తప్పినట్టే, మళ్ళీ దారి తప్పం గదా!" అన్నాడు.



ఆ ప్రశ్నతోగాని అందరికీ తాము చేసిన పొరపాటు తెలిసి రాలేదు. సింహాన్ని చంపాలన్న ఉత్సాహంలో ఎటు పోతున్నదీ గుర్తు పెట్టుకో కుండానే ముగ్గురూ సొరంగ మార్గాల వెంట పరిగెత్తారు. ఇప్పుడు ఏ మార్గాన వెళితే, తాము గుహావాసులుండే ప్రాంతాలకు చేరగలరో వాళ్ళకు అర్థంకాలేదు.

"మనం తొందరపడి ఏదో ఒక సొరంగ మార్గాన్ని పట్టి, దారి తెలియక తరవాత గందర గోళ పడటం మంచిది కాదు. ముందుగా మనం నీటి మడుగుకు ఎంత దూరంలో వున్నామో గ్రహించ గలిగితే బావుంటుంది," అన్నాడు జయమల్లు.

"ఆ సంగతి గ్రహించటం ఎలా?" అన్నాడు కేశవుడు.

జయమల్లు జవాబు చెప్పబోయేంతలో, కోయగోమాంగ్ అక్కడ ఎగుడు దిగుడుగా

వున్న రాళ్ళమీంచి పైకి పాకి, ఒక కంతలో నుంచి తల దూర్చి బయిటికి తొంగి చూస్తూనే, ''హా తల్లీ, కోనలమ్మా!'' అంటూ మూలిగి, కాసేపు ఆశ్చర్యంగా తల పంకించి, చప్పున కిందికి దూకాడు.

''ఏమిటంత ఆశ్చర్య పడ్డావ్? ఏం కన బడింది?'' అని జయమల్లు, గోమాంగ్‌ను ప్రశ్నించాడు.

గోమాంగ్ మెల్లిగా మాట్లాడమన్నట్టు అందరికీ సౌంజ్ఞ చేసి, ''మనం తిరిగి ప్రమా దాల్లో తల దూర్చాం. గుహాకందరాల్లో పడి మనం రెక్కల మనుషులుండే ప్రాంతం చేరటమేగాక, బ్రహ్మదండి మాంత్రికుడి క్కూడా చేరువ అయ్యాం,'' అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడి పేరు వింటూనే కేశవుడికీ, జయమల్లుకూ కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. వాళ్ళిద్దరూ, గోమాంగ్ ఎక్కి చూసిన కంత దగ్గిరకు పోతున్నంతలో, గోమాంగ్ వాళ్ళను హెచ్చరిస్తూ, ''మీరు తొందరపడి ఏదన్నా చేసి, మనం వున్న ప్రాంతం వాళ్ళకు తెలిసేలా చేయకండి. రెక్కల మను షులు బ్రహ్మదండి మాంత్రికుడి ముందు వ్యాయామ ప్రదర్శనలు చేస్తున్నట్టున్నది,'' అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ నిశ్శబ్దంగా పైకి పాకి కంతలో నుంచి బయిటికి తొంగి చూశారు. ఎదురుగా ఒకపెద్దమైదానం, పెద్దపెద్దవృక్షాలు. వాటి మీది నుంచి అనేక మంది రెక్కల మను షులు పక్షుల్లా ఎగిరి కిందికి దూకుతున్నారు. అక్కడ వున్న ఒక ఎత్తయిన రాతి ఆసనం మీద బ్రహ్మదండి మాంత్రికుడు కూచుని వుండి, చేతిలో గల మంత్రదండాన్ని అటూ ఇటూ ఊపుతున్నాడు. ''ఈసారి వీణ్ణి ప్రాణాలతో పోనివ్వకూడదు, చిత్రవధ చేయాలిసిందే,'' అన్నాడు కేశవుడు రోషంగా.

జయమల్లు తల వూపి ఏమో చెప్పబోయేం తలో, రెక్కల మనుషులు ఒక్కసారిగా హాహా కారాలు చేసి, చెల్లాచెదరుగా పారిపోసాగారు. బ్రహ్మదండి ఎగిరి రాతి మీద నిలబడి మంత్ర దండాన్ని గాలిలో ఊపుతూ, ''అం హుం ఫట్ ఘట్... కాల భైరవా...'' అంటూ కేకలు ప్రారంభించాడు. నిప్పులు కక్కే సింహం పారిపోతున్న రెక్కల మనుషుల కేసి వేగంగా పరిగెత్తుతున్నది. -(ఇంకావుంది)





# పరిష్కారం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఏ సమస్యకు పరిష్కారం వెతుకుతూ ఇలా శ్రమపడుతున్నావో తెలియదు. కాని, విజ్ఞులమని భావించే కొందరు తేలిగ్గా జరిగే పనిని క్లిష్టం చేసుకుంటూ ఉంటారు. దుర్మార్గుడైన అన్నను తొలగించి, మంచివాడైన తమ్ముడికి రాజ్యాధికారం అప్పగించడానికి లేనిపోని గందరగోళంలో పడ్డ ఒక మహారాజు, గురువుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఆదర్శపాలకుడిగా ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్న అవంతి రాజు శూరసేనుడికి వజ్రసేనుడు,



విక్రమసేనుడు అని ఇద్దరు కుమారులు. రాజు వయోభారం కారణంగా పెద్దకుమారుడు వజ్రసేనుడికి రాజ్య పట్టాభిషేకం చేసి, వానప్రస్థం స్వీకరించి భార్యతో సహా సమీప అరణ్యానికి వెళ్ళిపోయాడు.

వజ్రసేనుడు తండ్రి అడుగుజాడలలో రాజ్యపాలన చేయసాగాడు. వజ్రసేనుడికి గురుకులంలో తనతో కలిసి విద్యనభ్యసించిన మణిధరుడంటే ఎంతో ఇష్టం. వజ్రసేనుడు కొన్నాళ్ళకు మణిధరుడి చెల్లెలిని వివాహం చేసుకున్నాడు. వజ్రసేనుడు రాజయ్యాక చుట్టపు చూపుగా వచ్చిన మణిధరుడు రాజధానిలోనే స్థిరపడిపోయాడు. లోలోపల అతనికి అధికార దాహం పుట్టుకొచ్చింది. అందువల్ల అతడు వజ్రసేనుడి కళాభిరుచినీ, మృదు స్వభావాన్నీ ఆసరా చేసుకుని ఆయనకు మెల్లమెల్లగా వినోదాలపట్ల ఆసక్తి పెంచి, పాలనా వ్యవహారాల పట్ల అనాసక్తతను కలిగించసాగాడు. క్రమక్రమంగా వజ్రసేనుడు భోగలాలసుడై పాలనా వ్యవహారాలను పట్టించుకోలేకపోయాడు. మణిధరుడు రాజు తరపున ఒక్కొక్క అధికారాన్నీ కైవసం చేసుకోవడం మొదలుపెట్టాడు.

అధికారం మణిధరుడి వశం కావడంతో స్వార్థపరులైన అధికారులు అతని చుట్టూచేరి అతన్ని పొగుడుతూ-అమాయకులనూ, బలహీనులనూ పీడించసాగారు. రాజ్యంలో అవినీతి వేళ్ళూనింది; రాజోద్యోగులు ధనవంతులు కాసాగారు. వ్యాపారులు, సాధారణ ప్రజలు అధికారుల దౌర్జన్యాలకు గురవుతూ అష్ట కష్టాలు అనుభవించసాగారు.

ఈ దుస్థితిని భరించలేక పురప్రముఖులు కొందరు రాజును దర్శించి, తమ కష్టాలు చెప్పుకోవాలనుకున్నారుగాని, మణిధరుడు అడ్డు పడడం వల్ల, ఎంత ప్రయత్నించినా రాజదర్శనం సాధ్యం కాలేదు. వాళ్ళందరూ యువరాజు విక్రమసేనుణ్ణి కలుసుకుని తమ కష్టాలు తీరే మార్గం చూడమని మొరపెట్టుకున్నారు. అన్నను పదవి నుంచి తొలగించి, రాజ్యాధికారం చేపట్టమని పురికొల్పారు. అయితే విక్రమసేనుడు అందుకు ససేమిరా అన్నాడు.

దాంతో పురప్రముఖులు అరణ్యప్రాంతంలో తపోజీవనం సాగిస్తూన్న వృద్ధరాజు శూరసేనుడి వద్దకు వెళ్ళి, తమ గోడును విన్నవించి, చిన్న కుమారుణ్ణి రాజును చేస్తే తమ బాధలు తొలగిపోగలవని చెప్పారు. వారి మాటలు

విన్న రాజు శూరసేనుడు, ''ఐహిక బంధాలకు దూరంగా ఉంటూన్న నేను రాజ్యవ్యవహారా లలో జోక్యం చేసుకోలేను. కొన్ని రోజులు ఓర్పు వహించండి. మీ సమస్య పరిష్కార మవుతుంది,'' అని మాట ఇచ్చి పంపాడు.

శూరసేనుడు ఆ రాత్రంతా తీవ్రంగా ఆలో చించాడు. పురప్రముఖులు చెప్పినట్టు చేయడం ధర్మవిరుద్ధం. సరికొత్త సమస్యలు తలెత్తవచ్చునని భావించి, మరునాడు తమ కుమారులకు విద్యనేర్పిన మతంగముని గురుకులాశ్రమానికి బయలుదేరాడు. గురు వును చూసి ప్రజలు అనుభవిస్తూన్న కష్టా లనూ, తనసమస్యనూ విన్నవించి పరిష్కారం సూచించమని ప్రార్థించాడు.

అంతా విన్న గురువు, ''అవంతి ప్రజలు అనుభవిస్తూన్న కష్టాల గురించి నేనూ విన్నాను. నీ ఇద్దరు కుమారులూ సద్గుణసంపన్నులే. కాని వజ్రసేనుడి సహాధ్యాయి అయిన మణి ధరుడు దుష్టస్వభావుడు. ఈ అనర్థాలన్నిటికీ అతడే మూలకారణమని భావిస్తున్నాను. పక్షం రోజుల్లో దీనికొక పరిష్కారం కను గొందాం. నువ్వు నిశ్చింతగా వెళ్ళిరా,'' అని శూరసేనుణ్ణి సాగనంపాడు.

మరునాడే వజ్రసేనుడికి తాను వస్తున్నట్టు ఇద్దరు శిష్యుల ద్వారా వర్తమానం పంపి, రెండు రోజుల తరవాత గురువు రాజధానికి చేరుకున్నాడు. తనకు విద్యనేర్పిన గురువు వస్తున్నాడని తెలియగానే, వజ్రసేనుడు తన వినోదకార్యక్రమాలన్నిటినీ పక్కనబెట్టాడు. గురువుకు ఘనంగా స్వాగతం పలికి, సభా



మధ్యంలో ఉన్నతాసనంపై కూర్చోబెట్టి, ''తమ రాక నాకెంతో ఆనందంగా ఉన్నది. నేనేం చెయ్యాలో ఆజ్ఞాపించండి. చేస్తాను,'' అన్నాడు.

గురువు మందహాసం చేస్తూ, ''విద్యా భ్యాసం పూర్తికాగానే శిష్యుల నుంచి గురు దక్షిణ స్వీకరించడం గురుకుల సంప్రదాయం. అయితే, ఆ రోజు నీతో మాత్రం, 'అవసరమై నప్పుడు పుచ్చుకుంటాను,' అన్నాను జ్ఞాపకం ఉన్నది కదా?'' అని అడిగాడు.

''ఎలా మరిచిపోగలను గురువర్యా? ఏం కావాలో సెలవివ్వండి. ఈ క్షణమే సమకూరు స్తాను,'' అన్నాడు వజ్రసేనుడు.

''అడిగిన తరవాత వెనకడుగు వేయకూ డదు సుమా!'' అన్నాడు గురువు.

''ఇచ్చిన మాట తప్పడం మరణ సదృశం అని మీ శిష్యుణ్ణయిన నాకు తెలుసు. నిస్సం




కోచంగా అడగండి,'' అన్నాడు వజ్రసేనుడు దృఢమైన కంఠస్వరంతో.

''నీ అవంతీ రాజ్యం నాకు గురుదక్షిణగా కావాలి!'' అన్నాడు గురువు.

ఆ కోరిక విని ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందిన వజ్రసేనుడు మరుక్షణమే తేరుకుని, ''చిత్తం గురువర్యా! తమ అభీష్టానుసారం నా రాజ్యాన్ని...'' అంటూండగా పక్కనే వున్న మణిధరుడు అడ్డుపడి, ''ఆగండి మహారాజా! తరతరాలుగా వంశానుగతంగా వస్తూన్న రాజ్యలక్ష్మిని తొందరపడి గురుదక్షిణగా ఇవ్వడం ఏమాత్రం భావ్యం కాదు. ధనధాన్యాలు, మణులు మాణిక్యాలు, పశువులు పొలాలు మరేదైనా ఇవ్వండి,'' అన్నాడు.

''కాదు. నీ మాటవింటే మాట తప్పిన వాణ్ణి అవుతాను. మా వంశం అప్రతిష్ఠపాలవుతుంది,'' అని వజ్రసేనుడు గురువు కేసి తిరిగి, ''తమ అభీష్టానుసారం నా రాజ్యాన్ని గురుదక్షిణగా స్వీకరించండి,'' అంటూ కిరీటం తీసి గురువు పాదాల చెంత ఉంచాడు.

''నీ గురుభక్తి అనుపమానం వజ్రసేనా! ఇందులో కొంతయినా పాలనా వ్యవహారాల పట్ల శ్రద్ధ, మణిధరుడి వంటి దుష్టులను దూరంగా ఉంచాలన్న ముందుచూపు ఉండి వుంటే పరిస్థితి ఇంత దూరం వచ్చేది కాదు. ప్రజల క్షేమమే ప్రభువులకు అలంకారం,'' అంటూ గురువు తన ఇద్దరు శిష్యులను దగ్గరికి పిలిచి ఏదో చెప్పాడు.

శిష్యులు అరణ్యానికి వెళ్ళి, శూరసేన మహారాజును రాజధానికి తీసుకువచ్చారు. ఆయన రాగానే గురువు, ''రాజా! అవంతి రాజ్యాన్ని వజ్రసేనుడు నాకు గురుదక్షిణగా సమర్పించాడు. దానిని ఇప్పుడు నేను నీకు అప్పగిస్తున్నాను. ఇందులో ఎవరి నిర్బంధమూ లేదు. రాజ్యాన్ని రెండుగా విభజించి సగభాగానికి వజ్రసేనుణ్ణీ, రెండవ సగభాగానికి విక్రమసేనుణ్ణీ పాలకులుగా నియమించండి. తద్వారా ప్రజల కష్టాలు తొలగిపోయి, వారు సుఖశాంతులతో వర్ధిల్లగలరని ఆశిస్తున్నాను,'' అన్నాడు.

అన్నదమ్ములిద్దరూ అందుకు సంతోషంగా సమ్మతించడంతో, శూరసేనుడు గురువు సమక్షంలో ఆయన చెప్పినట్టు చేసి, ఆశ్రమానికి బయలుదేరాడు. ప్రజలు కృతజ్ఞతా పూర్వకంగా చేతులెత్తి మొక్కుతూ ఆయనకు వీడ్కోలు పలికారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, మొదట పురప్రముఖులు వచ్చి అన్నపై తిరుగుబాటు జరిపి, రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించమన్నప్పుడు నిరాకరించిన విక్రమసేనుడు, ఆ తరవాత తండ్రి ఇచ్చిన అర్ధరాజ్యాన్ని ఎలా స్వీకరించాడు? వ్యసనపరుడనీ, అసమర్థుడనీ తెలిసి కూడా వజ్రసేనుడికి మళ్ళీ అర్ధరాజ్యం కట్టబెట్టడం విజ్ఞత అనిపించుకుంటుందా? ఐహిక బంధాలు తెంచుకున్న తాను ఇకపై రాజ్య వ్యవహారాలలో జోక్యం చేసుకోనని చెప్పిన శూరసేనుడు, గురువును ఆశ్రయించి ఇంత తతంగం ఎందుకు జరిపించాడు? ఇది ఆయనలోని భేషజానికి తార్కాణం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజ్యాధికారం వంశానుగతంగా వచ్చే వారసత్వం. తిరుగుబాటు ద్వారా దాన్ని చేపట్టడం; అరాచకానికీ, అపప్రథకూ దారితీయవచ్చు. అందువల్లనే విక్రమసేనుడు పురప్రముఖుల ప్రతిపాదనను తోసి పుచ్చాడు. ఆ తరవాత గురువు, తండ్రి, అన్న సమ్మతించి ఇవ్వడంతో ప్రజాక్షేమం పరిరక్షించవలసినది తన బాధ్యత గనక దానిని స్వీకరించాడు. స్వభావరీత్యా వజ్రసేనుడు కూడా మంచివాడే కావడంవల్ల, ఇంత జరిగాక, బావమరిదిని దూరం చేసుకుంటే మంచి మార్గంలో పయనించి, సత్పరిపాలన అందివ్వడంలో తమ్ముడితో పోటీ పడగలడన్న ఆశాభావంతోనే గురువూ, రాజూ అతనికి మళ్ళీ అర్ధరాజ్యం అప్పగించారు. ఇక వానప్రస్థానికి వెళ్ళిన రాజు తిరిగి వచ్చి రాజ్యాన్ని స్వీకరించాడన్నది సరికాదు. గురువు స్వీకరించమన్న రాజ్యాన్ని ఆయనవెంటనే కుమారులకు పంచి ఇచ్చాడు. అది కూడా ప్రజాక్షేమం కాంక్షించి చేశాడే తప్ప, స్వార్థంతో కాదు. భేషజానికి అసలు తావేలేదు. ప్రజాక్షేమమే ప్రధానంగా భావించి గురువు, రాజు అందరికీ ఆమోదయోగ్యంగా, శాంతియుతంగా సమస్యను పరిష్కరించారు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : వాణిశ్రీ రచన]








## జ్ఞానవాపి

కాశీ విశ్వనాధ ఆలయం పక్కనే ఈ 'జ్ఞానవాపి' ఉన్నది. వాపి అంటే బావి. సాక్షాత్తు పరమశివుడే ఈ బావిని నిర్మించినట్టు భక్తులు చెబుతారు. క్షామం ఏర్పడి నీటిచుక్క కరువైనప్పుడు పరమశివుడు శూలాన్ని నేలకు గుచ్చడంతో నీరు పైకి చిమ్మిందట. అందువల్ల అందులోని జలాలను జ్ఞాన జలాలు గానూ, దానిని 'జ్ఞానవాపి'గానూ పేర్కొంటారు. బావి గట్టు మీద రావిచెట్టు ఉన్నది. దర్శనానికి వచ్చే భక్తులకు ప్రమాదం వాటిల్ల కుండా బావిచుట్టూ ఇనుప ఊచలు అమర్చ బడి ఉన్నాయి.

## శకునికి గుడి



మహాభారతంలోని శకునిని గురించి తెలియని వారంటూ ఉండరు. గాంధారి సోదరుడూ, దుర్యోధనుడి మేనమామా అయిన శకుని దుష్ట చతుష్టయంలో ఒకడు. మాయాజూదంలో ధర్మజుణ్ణి ఓడించి– పాండవుల అష్టకష్టాలకూ, కురువంశనాశనానికీ కారణమైన వాడు. అటువంటి దుష్టపాత్రగా పేరొందిన శకునికి గుడి ఉంది. కేరళ రాష్ట్రం, కొల్లం జిల్లా మయంకోట్టుమన కొండ పవిత్రేశ్వరంలో ఈ గుడి ఉంది. ఇక్కడ శకుని కౌరవులకు ఆయుధాలు ఇవ్వడం వల్ల దీనికి పవిత్రేశ్వరం అనే పేరు వచ్చిందట. ఇక్కడి పూజారులను 'ఊరాలీలు' (ఊరి పెద్దలు) అని అంటారు. దళితులైన 'ఊరాలీలే' పూజలను నిర్వహిస్తారు.

ఒరిస్సా జానపద కథ

# నిలబెట్టుకున్న మాట!

పొలంలో పనిచేస్తూ పిడుగుపాటుకు గురై తల్లిదండ్రులు మరణించడంతో కపిలుడనే క్షత్రియ బాలుడు అనాథ అయ్యాడు. కరుణా హృదయుడైన భూస్వామి వాణ్ణి చేరదీసి, తమ ఇంట పశువులు కాచే పనిని అప్పగించాడు.

కపిలుడు రోజూ పశువులను దాపులనున్న అడవికి తోలుకుపోయి మేపుకుని వచ్చేవాడు. అలా వాడు ఒకనాడు పశువులను కాస్తూండగా అతడి ఈడువాడే అయిన కాశి అనే కుర్రవాడు పరిచయమయ్యాడు. క్రమంగా వాళ్ళిద్దరి మధ్యా స్నేహం ఏర్పడింది. రోజూ ఇద్దరూ కలుసుకునేవారు. సాయంకాలం కపిలుడు ఆవులు తోలుకురావడానికి కాశి సాయపడేవాడు.

ఒకనాడు కపిలుడు పశువులను తోలుకు వెళుతున్నప్పుడు, ఉన్నట్టుండి తీవ్రమైన అలసటకు లోనయ్యాడు. చెప్పరాని తలనొప్పి వచ్చింది. అతడు దూరంగా ఉన్న కాశిని పిలిచి, ''మిత్రమా, నాకెందుకో మరీ అలసటగా ఉంది. కాసేపు అక్కడ నడుం వాలుస్తాను. నేను వచ్చేంత వరకు నా పశువులను కాస్త చూసుకుంటావా?'' అని అడిగాడు.

అలాగే అంటూ కాశి పశువుల వెంట వెళ్ళాడు. కపిలుడు ఒక చెట్టు కింద పడుకుని నిద్రపోయాడు. కొంత సేపటికి దాపుల నున్న పుట్ట నుంచి వెలుపలికి వచ్చిన ఒక నాగుపాము, పడగవిప్పి కపిలుడి ముఖం మీద ఎండపడకుండా గొడుగులా పట్టసాగింది. ఆ సంగతి కపిలుడికి తెలియదు.

చాలా సేపయినప్పటికీ, కపిలుడు రాకపోయే సరికి, కాశి అతన్ని వెతుక్కుంటూ వచ్చాడు. కపిలుడి తల మీద పాము పడగ విప్పి నీడ పడుతూన్న దృశ్యాన్ని చూసి దిగ్భ్రాంతి చెందాడు. కొంత సేపటికల్లా పాము అదృశ్యమై పోయింది. కాశి మిత్రుణ్ణి తట్టి లేపాడు. అతనికి ఎలాంటి అపాయం కలగనందుకు అమితానందం చెందాడు. తను





చూసిన అద్భుత దృశ్యాన్ని మిత్రుడికి వివరించి, ''దేవుడి దయవల్ల పాము నిన్నేమీ చేయలేదు. నువ్వు చాలా అదృష్టవంతుడివి కపిలా,'' అన్నాడు.

పాము పడగపట్టిన విషయం ఊరు ఊరంతా వ్యాపించింది. కపిలుడు క్షేమంగా ఉన్నందుకు. భూస్వామితో సహా అందరూ సంతోషించారు. గ్రామంలోని కొందరు వృద్ధులయితే, ''కపిలుడికి రాజయోగం ఉన్నది. అతడు అదృష్టవంతుడు. ఈ దేశానికే రాజు కాగలడు,'' అని జ్యోస్యం చెప్పారు. దాన్ని విని, ''నిజం, నిజం,'' అంటూ అందరూ సంబర పడ్డారు.

గ్రామస్థులందరూ తమ గ్రామానికి చెందిన పశులకాపరి కుర్రాడు కపిలుడు తమ రాజ్యానికి రాజయ్యే రోజు అట్టే దూరంలో లేదని మాట్లాడుకో సాగారు. ఇదంతా విన్న కాశి ఒకనాడు ఉత్సాహం కొద్దీ కపిలుణ్ణి, ''నువ్వు రాజైతే, నన్ను మరిచిపోవు కదా?'' అని అడిగాడు.

కపిలుడు కాశి రెండు చేతులూ పట్టుకుని, తన వక్షానికి ఆనించి, ''నిన్నెలా మరిచి పోగలను కాశీ? నేను రాజునైతే, నువ్వే నా మంత్రివి!'' అన్నాడు ఆవేశంతో.

మునుముందు తాను రాజు కాగలనని అందరూ చెప్పుకోవడం విని కపిలుడు పొంగి పోయాడు. భూస్వామి పశువులు కాయడం పట్ల ఆసక్తిని కోల్పోయాడు. తీవ్రంగా ఆలోచించాడు. తన మిత్రుణ్ణిసైతం సంప్రదించలేదు. అక్కడి నుంచి బయలుదేరాలని నిర్ణయించాడు. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో భూస్వామి ఇంటి నుంచి బయట పడ్డాడు. రెండు రోజుల పాటు ఎక్కడెక్కడో తిరిగి, ఆఖరికి రాజధాని పూరీ చేరాడు. జగన్నాథ మందిరంలో పెట్టే ప్రసాదం తింటూ కాలక్షేపం చేయసాగాడు.

ఒకనాడు రాజ్యాన్నేలే భానుదేవ మహారాజు ఆలయంలో ప్రార్థన ముగించుకుని వెలుపలికి వస్తూండగా ఆయన చూపులు కపిలుడి మీద పడ్డాయి. పసివాడి మెరిసే కళ్ళు, అద్భుతమైన ముఖ వర్చస్సు ఆయన్ను ఆకర్షించాయి. ఆయన వాడి దగ్గరికి వెళ్ళి, ''ఎవరు నువ్వు? ఇక్కడేం చేస్తున్నావు?'' అని అడిగాడు.

రాజు ప్రశ్నలకు ఉలిక్కిపడిన కపిలుడు వెంటనే తేరుకుని ధైర్యాన్ని కూడదీసుకుని, ''ప్రభూ! నేనొక పేద క్షత్రియ బాలుణ్ణి. నా పేరు కపిలుడు. చిన్నప్పుడే తల్లిదండ్రులను పోగొట్టుకున్న అభాగ్యుణ్ణి. ఏదైనా పని ఇప్పించే దయామయుల కోసం చూస్తున్నాను,'' అన్నాడు వినయంగా.

రాజు అతడి మాటలకు, వినయానికి మరింత ముచ్చటపడి, ''నా భవనంలో పని చేస్తావా?'' అని అడిగాడు.

''చిత్తం, మహారాజా! తమరేపని ఇప్పించినా సంతోషంగా చేయగలను,'' అన్నాడు కపిలుడు.

ఆ కుర్రవాణ్ణి రాజభవనానికి తీసుకురమ్మని భటులకు చెప్పి, రాజు రథం ఎక్కి బయలుదేరాడు.

రాజభవనం చేరిన కపిలుడికి సకల సదుపాయాలతో విశాలమైన గది కేటాయించబడింది. రాజభటులతో కలిసి భోజనం చేసేవాడు. రాజు అతనికి ప్రత్యేకంగా ఏ ఉద్యోగమూ ఇవ్వలేదు గాని, రాజభవన ప్రాంగణంలో తిరుగుతూ అక్కడ చూసే విశేషాలను తెలియజేయమని చెప్పాడు. కపిలుడు గుర్రపుశాల వద్ద చాలా సేపు గడిపేవాడు. రాజుగారి గుర్రాలను సైనికులు పోషించే పద్ధతులను ఆసక్తితో గమనించేవాడు.

రాజు భానుదేవుడికి సంతానం లేదు. అందువల్ల ఆయన కపిలుణ్ణి సొంత బిడ్డలా చూసుకోసాగాడు. అతడికి విద్యాబుద్ధులు నేర్పాడు. రాజోచిత విద్యలలో శిక్షణ నిచ్చాడు. యుద్ధకళలను అభ్యసించేలా చేశాడు. యుక్త వయస్కుడు కాగానే అతన్ని ఉపసేనాధిపతిగా నియమించాడు. పలుయుద్ధాలలో పాల్గొని తన శక్తి సామర్థ్యాలను నిరూపించే అవకాశాలు కపిలుడికి కలిగాయి. దాంతో రాజుగారి అభిమానానికి పాత్రుడయ్యాడు.

ఇలా మరి కొంత కాలం గడిచేసరికి రాజు భానుదేవుడు వృద్ధాప్యంలోకి అడుగుపెట్టాడు. ఆయన ఒకనాడు ప్రధానమంత్రి కృష్ణదేవుణ్ణి పిలిచి, ''మహామంత్రీ, నేను మరెంతోకాలం బతకననిపిస్తోంది. కపిలుణ్ణి పుత్రసమానుడిగా నేను చూసుకుంటూన్న విషయం నీకు తెలియనిది కాదు. నా తదనంతరం అతడే నా సింహాసనానికి వారసుడు కావాలన్నది నా కోరిక. అతడు దయామయుడూ, తెలివైనవాడూ, శక్తిసమన్వితుడూ అయిన ఆదర్శపాలకుడిగా ప్రజల ఆదరాభిమానాలు చూరగొనగలడని భావిస్తున్నాను,'' అన్నాడు.

రాజు అభీష్టానుసారం కపిలుడికి యౌవరాజ్యాభిషేకం చేయబడింది. యువరాజు కపిలుణ్ణి ప్రజలు అమితంగా గౌరవించారు. కొన్నాళ్ళకు అతడు కపిలేంద్ర దేవుడనే నామధేయంతో రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించాడు.



ఈ వార్త కొన్నాళ్ళకు గ్రామంలోని కాశికి తెలిసింది. ఇప్పుడు తను వెళ్ళి రాజుగారిని దర్శిస్తే, తనను గుర్తించి ఇచ్చిన మాట నిలబెట్టుకోగలడా అని ఆలోచించాడు. రాజును దర్శించాలని అప్పటికప్పుడే బయలుదేరాడు.

అతడు పూరీ రాజభవనం సమీపించాడు. కాని తాను రాజుగారి బాల్యస్నేహితుడినని చెబితే, భవన ద్వార కాపలా భటులు నమ్మలేదు. ''రాజుగారు జగన్నాథ ఆలయానికి వచ్చేప్పుడు చూడు. వెళ్ళు,'' అని అక్కడి నుంచి గెంటేశారు.

మరునాడు రాజుగారు దేవాలయానికి వెళ్ళే మార్గంలో కాశి జనంమధ్య నిలబడ్డాడు. దైవ దర్శనానంతరం రాజు వస్తూన్నప్పుడు, కాశి జనం నుంచి ముందుకువెళ్ళి రథానికి అడ్డంగా నిలబడ్డాడు. అతన్ని పక్కకు తప్పుకోమని ఒక భటుడు తోయబోయాడు. కాశి రాజును చూడాలని ప్రాథేయపడ్డాడు. వారిద్దరి మధ్యా జరుగుతూన్న సంభాషణను ఆలకించిన రాజు, రథాన్ని ఆపమని అతన్ని పరిశీలనగా చూశాడు. ''రాజా, నేనే కాశిని. తమ గ్రామం వాణ్ణి. పాము పడగ విప్పి తమకు నీడ పట్టిన విషయం చూసి చెప్పిన వాణ్ణి. తమరు రాజు కాగలరని గ్రామంలోని పెద్దలు చెప్పారు కదా? తమ మిత్రుడు కాశిని మరిచిపోయారా?'' అన్నాడు కాశి.

కాశి అనే మాట వినగానే పశులకాపరిగా గడచిన తన బాల్యమంతా రాజు మనసులో కదలాడింది. ఆయన రథం దిగివచ్చి కాశిని ఆప్యాయంగా కౌగిలించుకుని, ''నిన్నెలా మరిచిపోగలను మిత్రమా! రా, వెళదాం,'' అంటూ చేయిపట్టుకుని రథంలోకి ఎక్కించుకున్నాడు.

మరునాడు కొలువు తీరగానే రాజు కపిలేంద్ర దేవుడు, నిండు సభలో, ''నా బాల్య స్నేహితుడు కాశిని మంత్రిగా నియమిస్తున్నాను!'' అని ప్రకటించాడు.

సభాప్రాంగణం హర్షధ్వానాలతో మారుమోగింది. కాశి ఆనందాశ్చర్యాలతో రాజుగారికి కృతజ్ఞలు తెలియజేశాడు.



## అంతర్జాతీయ అహింసాదినోత్సవం




ఈ సంవత్సరం నుంచి అక్టోబర్ 2వ తేదీ గాంధీ జయంతిని అంతర్జాతీయ అహింసాదినోత్సవంగా జరుపుకోనున్నారు. జూన్ 15వ తేదీ దీనికి సంబంధించిన తీర్మానంలో ఐక్యరాజ్యసమితి, ''జనరల్ అసెంబ్లీ 62వ అసెంబ్లీ (సెప్టెంబర్‌లో ప్రారంభమయ్యే) చార్టర్ ఆఫ్ యునైటెడ్ నేషన్స్ మార్గదర్శకత్వంలో, ప్రతియేడు అక్టోబర్ 2వ తేదీ అంతర్జాతీయ అహింసాదినోత్సవం జరుపుకోవాలి'', అని పేర్కొన్నది. సభ్యదేశాలన్నీ ఈ దినోత్సవాన్ని జరుపుకోవాలనీ; విద్య, ప్రజల అవగాహన ద్వారా అహింసాసందేశాన్ని వ్యాపింపజేయాలనీ అసెంబ్లీ సభ్యదేశాలకు పిలుపునిచ్చింది. ఈ తీర్మానాన్ని భారతదేశం ప్రవేశపెట్టింది. రష్యా, చైనా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ మొదలైన 120కి పైబడ్డ దేశాలు మద్దతు తెలిపాయి.

## న్యూయార్క్‌లో చందమామ

న్యూయార్క్‌లో జూలై 14-16 మధ్య జరిగిన ప్రపంచ హిందీ మహా సభలకు భారతదేశం నుంచి ప్రతినిధిగా వెళ్ళిన హిందీ బాలసాహిత్య రచయిత శ్రీ షాంషర్ ఖాన్ తనతోపాటు మన దేశంలో వెలువడే పిల్లల పత్రికలను తీసుకువెళ్ళి, ప్రదర్శనను ఏర్పాటు చేశారు. వాటిలో హిందీ, ఇంగ్లీషు చందమామలతో పాటు జూనియర్ చందమామ కూడా చోటుచేసుకున్నది. ఈ ప్రదర్శన చూపరులను విశేషంగా ఆకర్షించి, ఆకట్టుకున్నదని ఆయన తెలిపారు. అదే విధంగా మన కర్నూలు విద్యానగర్‌లోని మాంటిసోరి హైస్కూల్లో జూలైలో చందమామ 60వ జన్మదినోత్సవం జరుపుకున్నారు. ఈ సందర్భంగా 2007 జూలైలో వెలువడిన చందమామ జన్మదిన ప్రత్యేక సంచికను ప్రధానంగా ప్రదర్శనకు ఉంచారు.





# దయ్యం చేసిన పెళ్ళి

మైలవరంలో పేరు మోసిన నగలవర్తకుడు వరహాలయ్య కొడుకైన సుధీరుడు చదువూ సంస్కారం గల అందమైన యువకుడు. యేటా మైలవరంలో జరిగే అమ్మవారి జాతరకు చుట్టుపక్కల నుంచి జనం తండోపతండాలుగా వస్తారు. అలా ఆ యేడు తన స్నేహితుడు మణికంఠుడి ఇంటికి వచ్చిన ఒక అందమైన యువతిని చూసి ఆశ్చర్యపోయి, ఆమె వివరాలడిగాడు సుధీరుడు. ఆమె పేరు సుచరిత అనీ, పొరుగూరిలో ఉన్న వాళ్ళ దూరపు బంధువు భూషయ్య కూతురు అనీ తెలియవచ్చింది.

ఆ రోజు సాయంకాలం మరేదో పని మీద సుధీరుడు మణికంఠుడి ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో అక్కడ ఆ ఊళ్ళో భారతం చదివే పూజారి, వాళ్ళగుమ్మంలో, కూర్చున్న వారిని ఏవో ప్రశ్నలు అడుగుతున్నాడు.

''మీరిన్నాళ్ళుగా నేను చదివే భారతం వింటున్నారు కదా. పాపం, పుణ్యం అంటే ఏమిటో చెప్పండి చూద్దాం?'' అన్న పూజారి ప్రశ్నకు అక్కడున్న వారెవరూ సమాధానం చెప్పలేక పోయారు. దూరంగా నిలబడ్డ సుచరిత చిన్నగా నవ్వుతూ చెయ్యిపైకెత్తింది.

''నీకు తెలిస్తే చెప్పమ్మా,'' అన్నాడు పూజారి.

''ఇతరులకు మేలు కలిగించడం పుణ్యం, బాధ కలిగించడం పాపం,'' అన్నది సుచరిత.

''చక్కగా చెప్పావు తల్లీ. ఈ ప్రశ్నకు కూడా నువ్వే సరైన సమాధానం చెప్పగలవనుకుంటాను. నువ్వు సూర్యుడిలా ప్రకాశించాలని కోరుకుంటావా? చంద్రుడిలా ప్రకాశించాలని ఆశిస్తావా?'' అని అడిగాడు పూజారి.

''దుర్మార్గుల పట్ల సూర్యుడిలా తీక్షణంగానూ, మంచివారి వద్ద చంద్రుడిలా చల్లగా ఉండాలనీ ఆశిస్తాను,'' అన్నది సుచరిత.

టి. రాజేంద్ర

ఆ సమాధానానికి అందరూ ఆనందంతో చప్పట్లు కొట్టారు. అంతలో మణికంఠుడి తల్లి ఇంటి నుంచి, ''భోజనాలకు వేళయింది. రండి,'' అంటూ వెలుపలికి వచ్చింది.

అందరూ లేచి భోజనాలకు ఇంట్లోకి వెళ్ళారు. చాటు నుంచి సుచరిత అందమే కాకుండా ఆమె తెలివితేటలు, చలాకీతనం, అణకువ చూసి ముగ్ధుడైన సుధీరుడు, ఆమెకు కూడా ఇష్టమైతే ఆమెను పెళ్ళాడా లనుకున్నాడు. రెండు రోజుల తరవాత స్నేహి తుడి ద్వారా సుచరిత తండ్రికి తన అభిమ తాన్ని తెలియజేశాడు. మైలవరం వెళ్ళి నప్పుడు అమ్మవారి గుడి వద్దసుధీరుణ్ణిచూసిన సుచరిత కూడా, తండ్రి ద్వారా సంగతి తెలుసుకుని పరమానందం చెందింది.

మంచిరోజు చూసుకుని భూషయ్య మైల వరం వెళ్ళి సుధీరుడి తండ్రి వరహాలయ్యను కలుసుకుని కూతురి పెళ్ళి విషయం ప్రస్తావిం చాడు. అంతా విన్న వరహాలయ్య, ''మా అబ్బాయి కూడా ఇష్టపడుతున్నాడంటు న్నావు గనక, మీ అమ్మాయిని మా ఇంటి కోడలుగా చేసుకోవడానికి నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు. అయితే, ఇప్పటికే లక్షలకు లక్షలు కట్నంగా ఇస్తామంటూ అనేక సంబంధాలు వచ్చాయి. నువ్వు లక్ష వరహాలు కట్నంగా ఇచ్చేమాటయితే, రాబోయే ముహూర్తంలోనే పెళ్ళి జరిపించవచ్చు,'' అన్నాడు నిర్మొహమాటంగా.

అంత కట్నం ఇచ్చే తాహతు లేదు గనక, భూషయ్య మరేమీ మాట్లాడలేక అక్కడి



నుంచి వెనుదిరిగి వచ్చి, కుమార్తెకు విషయం చెప్పాడు. సుచరిత ఎంతో బాధపడింది.

నెల రోజులు గడిచిపోయాయి. సుచరిత ఒకనాడు బిందె తీసుకుని మంచి నీళ్ళు తేవడం కోసం తన స్నేహితురాలు సుమతితో కలిసి కొలను వద్దకు వెళ్ళింది. సుచరిత విచా రంగా ఉండడం గమనించినసుమతి, ''ఎందు కలా విచారంగా ఉన్నావు?'' అని అడిగింది.

సుచరిత గాఢంగా నిట్టూరుస్తూ, ''నాకు సుధీరుడితో పెళ్ళవుతుందనే ఆశపడ్డాను. అతడూ నన్నెంతగానో ఇష్టపడ్డాడు. నేనూ అతన్ని ఇష్టపడ్డాను. అయితే, అతని తండ్రి ధనాశ, మా పేదరికం అడ్డుగోడలుగా నిలవ డంతో మా పెళ్ళి జరగలేదు. ఇప్పుడు వాళ్ళు సుందరి అనే ధనవంతురాలైన మరో అమ్మాయి పెళ్ళిచూపులకు వెళుతున్నారట,'' అన్నది.



ఆమె మాటలు మంచినీళ్ళ కొలనుకు కొద్ది దూరంలోని చింతచెట్టు మీద కునుకు పాట్లు పడుతున్న దయ్యం చెవిన పడి, ఉలిక్కిపడి లేచింది. చాలినన్ని కట్నకాను కలు తీసుకురాలేదని అత్తమామలు పెట్టిన బాధలు భరించలేక, ఆత్మహత్య చేసుకోవడం వల్లే, ఇవాళ తను దయ్యంగా కాలం వెళ్ళ దీస్తోంది. సుచరిత పరిస్థితికి దయ్యం చలించి పోయి, ఆమెకు ఎలాగైనా సాయపడాలని నిర్ణయించింది.

తల్లిదండ్రుల వెంట సుధీరుడు పెళ్ళి చూపులకు వెళ్ళాడు. సుందరిని అలంక రించి తీసుకు వచ్చి ఎదుట కూర్చోబెట్టారు. సుందరి ఉన్నట్టుండి పళ్ళెంలో ఉన్న అరటి పండును తీసి, ఒక ముత్తయిదు మీదికి విసిరింది. పూల జడను లాక్కుంటూ తలపై కెత్తి బిత్తర చూపులు చూడసాగింది. అంతే, వచ్చిన వారందరూ సుందరికి పిచ్చిపట్టిందను కోవడంతో పెళ్ళిచూపులు ఆగిపోయాయి.

మరునాడు ఒంటరిగా కొలనుకు నీళ్ళు తేవడానికి వెళ్ళిన సుచరిత, ''నిన్ను కాదన్న ఆ పొగరుబోతుకు తగిన శాస్తి జరిగింది. పెళ్ళి ఆపేశాను,'' అన్న మాటలు విని తల పక్కకు తిప్పి చూసింది. ఒక దయ్యం చెట్టుపై నుంచి కిందికి దూకుతూ, ''సుందరిని పట్టు కుని, వింతచేష్టలు చేసి, దాని పెళ్ళి చూపులు ఆగిపోయేలా చేశాను. నీకు సంతోషమే కదా?'' అన్నది.

సుచరిత దయ్యాన్ని చూసి మొదట భయపడ్డా, ఆ తరవాత తేరుకుని, ''ఎంత మాత్రం కాదు. నా మూలంగా ఒక ఆడపిల్ల పెళ్ళి ఆగిపోవడం చాలా బాధాకరం. అయినా, ఎవరు నిన్నీ పనిచేయమన్నారు?'' అన్నది బాధగా.

''ఎవరో చెప్పాలా ఏం? నాలుగు రోజుల క్రితం నువ్వు నీ స్నేహితురాలితో చెప్పిన మాటలన్నీ విన్నానులే. నువ్వు కోరిన సుధీరు డితో నీ పెళ్ళి జరిపించేంతవరకు నాకు నిద్ర పట్టదు,'' అన్నది దయ్యం పట్టింపుగా.

''ఇంతవరకు నువ్వు చేసిన నిర్వాకం చాలు. ఇకపై దయచేసి నా విషయంలో జోక్యం చేసుకోవద్దు,'' అంటూ వేగంగా ఇంటికి తిరిగి వచ్చి, తండ్రికి జరిగిన సంగతి చెప్పింది.

ఆ విషయాన్ని వరహాలయ్యకు చెప్ప డానికి భూషయ్య అప్పటికప్పుడే మైలవరం బయలుదేరాడు. భూషయ్యను చూసిన

వరహాలయ్య ఏమీ మాట్లాడలేక పోయాడు. కూర్చోమని చేయి చూపాడు. భూషయ్య కూర్చుని జరిగిన అసలు సంగతిని వివరించి, ''జరిగిందేదో జరిగిపోయింది. పెళ్ళిచూపుల వరకు వచ్చాక ఆ సుందరికి అన్యాయం జరగ కూడదు. ఆ అమ్మాయినే మీ అబ్బాయికి చేసుకోండి. తప్పులేదు,'' అన్నాడు.

వరహాలయ్య మౌనంగా పక్కనున్న కొడుకు కేసి చూశాడు.

సుధీరుడు, ''సుచరిత ఎంత మంచిదో ఇప్పుడైనా మీకు తెలిసిందా? తాను బాధపడ్డా ఫరవాలేదు; సాటి యువతికి అన్యాయం జరగకూడదన్న గొప్ప మనసుతో తన తండ్రిని మీ దగ్గరికి పంపిందంటే ఆమెలోని మంచి తనం ఎలాంటిదో ఆలోచించి చూడండి. మీరేమో డబ్బూ, డబ్బూ అంటూ నాకు ఇష్టం లేని పెళ్ళి ఏర్పాటు చేయాలనుకు న్నారు. ధన పిశాచం పట్టుకుని కన్న కొడుకు మీద కూడా కనికరం చూపని మీకన్నా, ఒక ఆడపిల్ల కష్టం చూసి కరిగిపోయి సాయపడా లనుకున్న ఆ దయ్యమే నయం కదా?'' అన్నాడు విరక్తిగా.

వరహాలయ్య, ''నాయనా, మనం ఉన్న వాళ్ళమే అయినా, కలిగినవారింటి సంబంధం అయితే, నీకు మునుముందు మేలు చేస్తుం దని ఆలోచించాను. అంతేగాని, ఇప్పుడు మించి పోయిందేమీ లేదు. నీకు నచ్చిన సుచరితనే పెళ్ళి చేసుకుని హాయిగా జీవించు. ఒక్కగానొక్క బిడ్డవు. నీ ఇష్టానికి అడ్డురాను. నీ మాట కాదనను. సుచరిత వంటి గుణవం తురాలు మన ఇంటి కోడలుగా రావడమే అదృష్టం,'' అన్నాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన పెళ్ళిళ్ళ పేరయ్య జరిగినదంతా తెలుసుకుని, ''ఆహా, ఇంకేం. అంతా సవ్యంగా జరిగిపోయిందన్నమాట! సుందరి వివాహం కూడా సమస్య కాదు. తగిన వరుణ్ణి చూసి, మీ వివాహంతోనే ఆమె పెళ్ళి కూడా జరిపించే పూచీ నాది,'' అన్నాడు ఉత్సాహంగా సంచీలోంచి వరుల జాతకాల కట్ట వెలికి తీస్తూ.

అనుకున్నట్టుగానే సుచరిత, సుధీరుల వివాహం వైభవంగా జరిగింది. తమ పెళ్ళి జరగడానికి సాయపడ్డ దయ్యానికి వధూ వరులు మనసులో కృతజ్ఞతలు చెప్పుకున్నారు.



చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 1

# ఒక రాణిగారి వ్యూహరచన

ఏడు శతాబ్దాలకు పూర్వం 1296వ సం.లో సుల్తాన్ అలాఉద్దీన్ ఖిల్జీ, మామ జలాలుద్దీన్‌ను దారుణంగా హతమార్చి ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించాడు. అతడికి అమితమైన రాజ్య కాంక్ష, అధికారదాహం ఉండేవి. అసంఖ్యాక మైన ఏనుగులు, డెబ్భైవేల అశ్వాలతో గొప్ప సైనిక బలం తోడు కావడంతో అడుగు పెట్టిన ప్రతిప్రాంతాన్నీ ఆక్రమించుకోవాలి; కనిపించిన ప్రతి సంపదనూ దోచుకోవాలి అనే పేరాశ అతనిలో పెరిగిపోయింది.

ఒకనాడు అతడి దృష్టి రాజస్థాన్‌లోని సుసంపన్న మైనమేవారు రాజధాని చిత్తోర్‌ఘుడ్ మీదపడింది. అందమైన ప్రకృతి దృశ్యాల మధ్య 500 అడుగుల ఎత్తయిన కొండమీద 700 ఎకరాల విస్తీర్ణంలోవెలసిన అభేద్యమైన కోట అది. మాతృభూమి కోసం సర్వం అర్పించడానికి వెనుకాడని రాజపుత్ర వీరుల పోతుగడ్డ అది. దాన్ని ముట్టడించాలని ఖిల్జీ నిర్ణయించాడు. కోటను వశపరచుకోవడం కన్నా, మేవార్ రాజు మహారాణా రావల్ రతన్ సింగ్ ప్రియపత్ని అతిలోక సౌందర్యవతి రాణి పద్మినిని ఎలాగైనా సొంతం చేసుకోవాలన్నదే అతడి కోరికగా ఉండేది.



రాణి పద్మిని సౌందర్యం గురించి రాజ కుటుంబాలలో కథలు కథలుగా చెప్పుకునేవారు. నీళ్ళు తాగినా గొంతులో కనిపించేంత లేత బంగారు మేనిఛాయ గలదనీ; ఆమె సుమనోహర సుందర రూపాన్ని తిలకించడానికి సూర్యచంద్రులు సైతం క్షణం ఆగి వెళతారనీ -ఆమె సౌందర్యం గురించి కవులు కవితలు వెలయించారు. అలాంటి సౌందర్య రాశిని సొంతం చేసుకోవాలని 1302లో సుల్తాన్ ఖిల్జీ సైన్యంతో బయలుదేరి రాజపుత్ర వంశ గౌరవ మర్యాదలకు చిహ్నమైన చిత్తోర్‌ఘుడ్‌ను ముట్టడించాడు.

కొండ దిగువ కోటను చుట్టుముట్టి ఆరు నెలలు పోరాడినప్పటికీ, సాహసవీరులైన రాజపుత్ర సైనికులను దాటుకుని సుల్తాన్ కోటలోకి అడుగు పెట్టలేకపోయాడు. ఆశాభంగానికి లోనైన సుల్తానుకు స్నేహహస్తం సాచడం తప్ప మరో మార్గం లేకపోయింది. "రాణి పద్మిని మోమును ఒకసారి చూస్తే చాలు. ముట్టడిని ఎత్తివేసి సంతోషంగా తిరిగి వెళ్ళగలను," అని రాజుకు వర్తమానం పంపాడు.

"అసాధ్యం! ఢిల్లీ సుల్తాను మనరాణిగారిని ప్రత్యక్షంగా చూడడమా?" అంటూ చిత్తోర్ ప్రముఖులు అడ్డుపలికారు. కావాలంటే అతడు అద్దంలో రాణిగారి ప్రతిబింబాన్ని చూసి వెళ్ళవచ్చు అని ప్రత్యామ్నాయ ప్రతిపాదనను సుల్తా

నుకు తెలియజేశారు. సుల్తాను అందుకు సమ్మతించాడు.

తామర సరస్సు మధ్యలో వేసవి భవనం ఉంది. భవనం మెట్లవద్ద నిలబడితే, పైనున్న అద్దంలో మహారాణి ప్రతిబింబం కనిపించేలా ఏర్పాటు జరిగింది. అమితాసక్తితో మెట్లపై నిల బడ్డ సుల్తాన్ ఖిల్జీ, తృటికాలం కనిపించిన రాణిగారి ప్రతిబింబాన్ని చూసి, ''ఆహా, అపు రూపమైన ఈ సౌందర్యరాశిని ఎలాగైనా అప హరించుకు పోవాలి!'' అని ఆలోచిస్తూ కపటో పాయంతో తన కార్యాన్ని సాధించాలని పథకం రూపొందించుకున్నాడు.

తనకిచ్చిన ఆతిథ్యానికి పరమానందం చెందు తున్నట్టు రాజును ఆప్యాయంగా కౌగిలించుకు న్నాడు. రాణి ప్రతిబింబాన్ని చూడడానికి ఒంట రిగా వచ్చాడు గనక, అతన్ని కోట ద్వారం దాటి వెళ్ళి సాగనంపిరావడం మర్యాద అని భావించిన రాజు మహారాణా రతన్‌సింగ్ నిరాయుధ పాణిగా, అంగరక్షకులెవరూ లేకుండా, మాట్లా డుతూ సుల్తాను వెంట వెళ్ళాడు.

ద్వారం వెలుపలికి వచ్చిన రాణారతన్‌సింగ్, ''మిత్రులుగా మసలుకోవలసిన మనం శత్రు వులు కావడం విధివైపరీత్యం!'' అంటూ వింత అతిథికి వీడ్కోలు పలికాడు.

అప్పటికే పొద్దుపోయి చీకటి అలముకుం టున్నది. ఇద్దరూ ఆఖరు సారిగా కౌగిలించు కున్నప్పుడు, దుష్టుడైన ఖిల్జీ సైగ చేయడంతో, చుట్టూ పొదల మాటున దాగివున్న అతడి సైని కులు నిరాయుధపాణిగా ఉన్న రాణారతన్ సింగును చుట్టుముట్టి పట్టుకున్నారు. మైదా నంలో ఉన్న తమ గుడారాలలోకి తీసుకువెళ్ళారు. రాజు తప్పించుకోలేని బందీ అయ్యాడు.

''వెంటనే రాణి పద్మినిని నాకు అప్పగిం చండి. లేదా మీ రాజు తలను అందుకోవడానికి చిత్తోర్ వీరులు సిద్ధంకండి!'' అంటూ సుల్తాన్ ఖిల్జీ హెచ్చరిక పంపాడు.

కోటను శోకం అలముకున్నది. అయినా, తెల్లవారే సరికి ఇద్దరు సైనికులు మహారాణి పద్మిని సందేశంతో సుల్తాన్ ఖిల్జీ శిబిరాన్ని చేరుకు న్నారు: ''రాణి పద్మిని సుల్తానుకు లొంగి పోవ డానికి సిద్ధంగా ఉన్నారు. అయితే, ఒక నిబం ధన. ఆమె ఇక్కడి సంప్రదాయానుసారం మేనా లలో చెలికత్తెలతో సహా రావడానికి అనుమతిం చాలి. అందరినీ గౌరవంగా చూసుకోవాలి.''



సుల్తాన్ పట్టరాని ఆనందంతో ఎగిరిగంతేసి రాణిగారి ప్రతిపాదనకు సమ్మతించాడు. రాణి కోసం ప్రత్యేక గుడారం ఏర్పాటు చేశాడు.

మరునాడు సాయంకాలం చిత్తోర్ కోట తలుపులు తెరుచుకున్నాయి. ఏడువందల మేనాలు -ఒక్కొక్క మేనాను నలుగురు బోయీలు మోసుకురాగా, కొండపై నుంచి కిందికి ఊరేగింపుగా బయలుదేరాయి.

గుడారాల మధ్య ఉత్కంఠతతో ఎదురు చూస్తూన్న సుల్తాను వద్దకు గోరా అనే ఆజానుబాహువైన రాజపుత్ర యోధుడు వచ్చి నమస్కరించి, "ప్రభూ! మహారాణిగారు తన భర్తను కడసారి చూసి వీడ్కోలు చెప్పాలని ఆశిస్తున్నారు. ఆమె విన్నపాన్ని ప్రభువులు కాదనరని భావిస్తున్నారు," అన్నాడు.

సుల్తాన్ ఆలోచనతో మౌనం వహించడంతో, "మహారాణిగారి మాట మీద తమకు ఇంకా నమ్మకం లేదా ప్రభూ?" అంటూ గోరా మేనా వేసి చేయి పైకెత్తగానే, అందులోని ఒక చెలికత్తె తెరను కొద్దిగా పక్కకు తొలగించింది. కాగడా కాంతిలో అందాలరాశి తళుక్కుమనడం చూసి సుల్తాన్, "ఆహా, నేను అద్దంలో చూసిన అదే సుందర రూపం!" అనుకుంటూ పొంగిపోయాడు. ఆ తరవాత ఆమె ఇష్టానుసారం భర్తను చూడడానికి అనుమతించాడు.

మొదటి మేనా మహారాణా బందీగావున్న గుడారం కేసి కదిలింది. గోరా దాన్ని అనుసరించి వెళ్ళి, రాణా రతన్ సింగును విడిపించి ఈలవేయడంతో, మేనాల నుంచి రెండువేలా ఎనిమిది వందల సాయుధులైన సైనికులు బయటకు ఉరికారు. మేనాలను మోసుకొచ్చిన వారు కూడా సైనికులే. అందరూ మేనాల్లోని కత్తులను అందుకుని అందిన వారిని అందినట్టు తెగటార్చ సాగారు. ఈ అనూహ్యపరిణామానికి దిగ్భ్రాంతి చెందిన సుల్తాన్ సైనికులు ఎక్కువ మంది చెట్టుకొకరు పుట్టకొకరుగా పరిగెత్తారు.

మళ్ళీ కొన్ని మేనాలు కొండ మీది కోట కేసి బయలుదేరాయి. వాటిల్లో రాణి పద్మిని ఉందన్న ఆశతో కొందరు సైనికులు వెంబడించారుగాని, బాదల్ అనే యువకుడి నాయకత్వంలో రాజపుత్ర సైనికులు వారిని నిలువరించి ఎదుర్కొన్నారు. ఒక మేనాలో మహారాణా, గోరా క్షేమంగా కోటను చేరారు.

ఆ తరవాత గోరా తిరిగి వచ్చి శత్రువులను ఎదుర్కొన్నాడు. గోరాకూ, సుల్తానుకూ మధ్య జరిగిన భయంకర యుద్ధంలో గోరా అపూర్వ



ధైర్య సాహసాలు ప్రదర్శించాడు. అయితే, దురదృష్టవశాత్తు శత్రువులు చుట్టుముట్టి అతడి శిరస్సును ఖండించారు. ఆ స్థితిలో సైతం గోరా విసిరిన కత్తివేటుకు, తాను ఎక్కిన గుర్రం రెండు ముక్కలు కావడంతో సుల్తాన్ ఖిల్జీ కింద పడి చిత్తోర్ మట్టికరిచాడని చెబుతారు. ఆ దెబ్బతో సుల్తాన్ ఢిల్లీకి తిరుగుముఖం పట్టాడు.

చిత్తోర్ రాణి పద్మిని-పినతండ్రి గోరా, సోదరుడు బాదల్‌తో కలిసి వ్యూహంపన్ని విజయవంతంగా శత్రువుల నుంచి బయట పడినప్పటికీ, ఆమె మాత్రం చిత్తోర్ కోట ద్వారాలు దాటి వెలుపలికి రాలేదు. సుల్తాన్ అద్దంలో చూసినది ఆమె చెలికత్తె ప్రతిబింబాన్ని! మేనాలో కనిపించినది కూడా అదే చెలికత్తె!

తాము మళ్ళీ కలుసుకున్నందుకు రాజ దంపతులు సంతోషించినప్పటికీ, గోరా మరణం వారికి ఆవేదన కలిగించింది.

కొన్నినెలలు ప్రశాంతంగా గడిచాయి. ఆరోజు రతన్ సింగ్ జన్మదినోత్సవాన్ని ఆటపాటలతో జరుపుకుని, రాత్రి ఆలస్యంగా పడుకున్న చిత్తోర్ ప్రజలను యుద్ధభేరీలు, హాహాకారాలు మేలుకొలిపాయి. తనకు జరిగిన అవమానాన్ని భరించలేక, ఇనుమడించిన ప్రతీకార వాంఛతో సుల్తాన్ ఖిల్జీ 1303లో మళ్ళీ చిత్తోర్ మీదికి దాడి చేశాడు. రాజపుత్రుల సైనికుల కన్నా, సుల్తాన్ సైనికులు పదింతలు ఉన్నారు. వాళ్ళందరూ కోటను ఒక్కసారిగా ముట్టడించారు. అయినా రాజపుత్ర సైనికులు వెనుకాడకుండా పోరాడి వీరమరణం పొందారు. ఆఖరికి మహారాణా రతన్‌సింగ్, యువకిశోరం బాదల్ యుద్ధరంగంలోకి విజృంభించి, అసంఖ్యాకులను హతమార్చి మాతృభూమి పరిరక్షణకు ప్రాణాలర్పించారు!

అదే సమయంలో కోటలోపల రాణి అంతఃపురంలో పెద్ద చితి పేర్చబడింది. రాణి పద్మిని ముకుళిత హస్తాలతో అగ్ని ప్రవేశం చేసింది. ఆమె తరవాత దాదాపు ముప్పైవేల మంది స్త్రీలు ఆమెను అనుసరించారు! శత్రువుల చేజిక్కకుండా, మానసంరక్షణ కోసం అగ్నికి ఆహుతయ్యారు! ఆకాశాన్ని పొగమేఘాలు కమ్ముకున్నాయి. నగరాన్ని విషాదమేఘాలు ఆవరించాయి.

మిగిలి వున్న సైనికులు చివరిశ్వాస ఉన్నంత వరకు శత్రువులను చీల్చి చెండాడారు. సహనం కోల్పోయిన సుల్తాన్ ఖిల్జీ, "పద్మిని ఎక్కడ? ఎక్కడ?" అని కేకలు పెడుతూ కోట అంతా వెతికాడు. ఆగ్రహావేశంతో మతి చలించినవాడిలా కనబడిన కట్టడాలన్నిటినీ నాశనం చేశాడు. ఆఖరికి రాణిపద్మిని భవనాన్ని సమీపించి అక్కడి దృశ్యాన్ని చూడగానే నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

అతిలోక సౌందర్యవతిగా ప్రసిద్ధి గాంచిన ఒక వీరవనిత వ్యూహ రచనకూ; ప్రదర్శించిన సాహసానికీ, అనుపమ త్యాగానికీ మౌనసాక్ష్యంగా ఆ కోట ఇప్పటికీ నిలచి ఉన్నది!

-(ఎ.కె.డి)





మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (22)

# అధ్యక్షుడి క్షమాభిక్ష

పద్దెనిమిదవ శతాబ్దంలో ప్రపంచం ఇప్పటి ప్రపంచానికన్నా చాలా భిన్నంగా ఉండేది. జీవితం నెమ్మదిగా సాగేది. గొప్ప నాయకులు సైతం అందరికీ అందుబాటులో ఉండేవారు.

1789లో జార్జ్ వాషింగ్టన్ (1732-1799) అమెరికా సంయుక్త రాష్ట్రాలకు మొట్టమొదటి అధ్యక్షుడయ్యాడు. విజయవంతమైన సేనాధిపతి అయిన వాషింగ్టన్ సమర్థుడైన అధ్యక్షుడుగా పేరుతెచ్చుకున్నాడు.

వాషింగ్టన్ బాల్యంలో వర్జీనియాలోని ఒక బడిలో చదువుకునేప్పుడు పీటర్ మిల్లర్ అనే సహవిద్యార్థి ఉండేవాడు. ఇద్దరూ మంచి మిత్రులు. అయినా, మిల్లర్ సైన్యంలోగాని, రాజకీయాల్లోగాని చెప్పుకోతగ్గ ఎలాంటి విజయమూ సాధించలేదు. ఎఫ్రాటా పట్టణంలోని చర్చిలో పూజారిగా ఉండేవాడు.

సమాచారాన్ని ఒక చోటి నుంచి మరో చోటికి పంపడం ఆ కాలంలో సాధ్యమయ్యేది కాదు. వాహనాలు కూడా తక్కువే. పీటర్ మిల్లర్ మూడు రోజుల పాటు నడిచి తన సుప్రసిద్ధ మిత్రుణ్ణి చూడడానికి వెళ్ళాడు. బాల్యమిత్రుణ్ణి చూసి వాషింగ్టన్ అమితానందం చెందాడు. కుశల ప్రశ్నలు పూర్తయ్యాక, ''సరే పీటర్, అంత కష్టపడి ఇంత దూరం రావడానికి ప్రత్యేక కారణం ఏమైనా ఉన్నదా?'' అని అడిగాడు వాషింగ్టన్ తన మిత్రుణ్ణి.

''అవును జార్జ్, ఉన్నది. దేశద్రోహం నేరం కింద మరణశిక్ష పొందిన మైఖేల్ విట్మన్ అనే వ్యక్తి కోసం క్షమాభిక్ష వేడుకోవడానికి వచ్చాను,'' అన్నాడు పీటర్.

''నీ కోరికను నెరవేర్చలేనందుకు విచారిస్తున్నాను పీటర్. మనది కొత్త దేశం. దేశద్రోహులను

## చందమామ ఇండియా క్విజ్-7 (ఆగస్ట్ 2007) సమాధానాలు

1. బడ్జెట్ సమావేశ ప్రారంభంలో లోక్‌సభ, రాజ్యసభ సంయుక్త సమావేశంలో రాష్ట్రపతి ఉపన్యసించేప్పుడు.
2. జి.వి. మావ్లంకర్.
3. రాజ్యసభ అధ్యక్షపదవి.
4. రాష్ట్ర శాసనసభ సభ్యులు.
5. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి.
6. డా. ఎస్. రాధాకృష్ణన్.
7. 35 సం.లు.
8. ఆంగ్లో-ఇండియన్ సంతతికి చెందినవారిని.
9. లోక్‌సభ, రాజ్యసభ సభ్యులు.
10. 1952 మే 13.



కఠినంగా శిక్షించవలసిన అవసరం ఉన్నది. మరేదైనా అడుగు,'' అన్నాడు అధ్యక్షుడు.

విట్మన్‌ను ఉరి తీసినట్టయితే, వ్యాధిగ్రస్తురాలైన అతడి భార్య, చిన్న పిల్లలు మరే ఆధారమూ లేకుండా అనాథలై పోతారని పీటర్ వివరించి వాదించాడు. అయితే, వాషింగ్టన్ ఏమాత్రం మెత్తబడలేదు. వారి సమావేశం ముగింపుకు వచ్చింది. అయినా, ఆ రాత్రికి తమ ఇంట ఉండివెళ్ళమని వాషింగ్టన్ ప్రేమతో కోరడంవల్ల పీటర్ అక్కడే ఉండడానికి సమ్మతించాడు.

ఒక గంట గడిచాక, అక్కడికి వచ్చిన మరొక వ్యక్తితో, పీటర్ మిత్రుడు విట్మన్‌ను కాపాడలేని తన అశక్తతను చెప్పుకుని వాషింగ్టన్ బాధపడ్డాడు. అక్కడికి వచ్చిన పెద్దమనిషి కొన్నేళ్ళుగా ఎఫ్రాటాలో ఉండడం వల్ల పీటర్, విట్మన్ ఇద్దరిని గురించీ ఆయనకు బాగా తెలుసు. అందువల్ల ఆయన ఆశ్చర్యంతో, ''ఏమన్నారూ? విట్మన్, పీటర్ స్నేహితుడనా మీరు అనుకుంటున్నారు?'' అని అడిగాడు.

''అవును. అలాగే అనుకుంటున్నాను. లేకుంటే పాపం పీటర్, అతనికి క్షమాభిక్ష అడగడానికి ఇంత దూరం నడుచుకుంటూ రాడు కదా?'' అని వాషింగ్టన్ ఎదురుప్రశ్న వేశాడు.

ఆ పెద్దమనిషి పెద్దగా నవ్వుతూ, ''నిజం చెప్పాలంటే, ఈ ప్రపంచంలో పీటర్ మిల్లర్‌కు శత్రుమంటూ ఉన్నాడంటే, అది విట్మన్ మాత్రమే. వాడు పీటర్‌ను చివరిదాకా శతవిధాలా వేధించాడు,'' అన్నాడు.

అధ్యక్షుడు ఒక్కక్షణం నివ్వెరపోయాడు. ఆ తరవాత తన కార్యదర్శిని పిలిచి, విట్మన్ క్షమాభిక్ష ఉత్తర్వును జారీ చేశాడు. ఆ పిమ్మట పీటర్ మిల్లర్‌ను తన గదికి పిలిపించాడు.

''అవును, పీటర్. తన మిత్రుడికి ప్రాణభిక్ష కోరిన వ్యక్తి విజ్ఞప్తిని తిరస్కరించగలనేగాని, తన బద్ధశత్రువు ప్రాణం కోసం ప్రార్థించే వ్యక్తి గొప్ప ఔదార్యాన్ని ప్రశంసించకుండా ఉండలేను కదా?'' అన్నాడు వాషింగ్టన్ చిన్నగా నవ్వుతూ.

-(ఎం.డి)



నవలాకారిణి, కథానికా రచయిత్రి అయిన శశి దేశ్‌పాండే రచించిన ఎనిమిది కథాసంకలనాలు, ఎనిమిది నవలలు, ఒక క్రైమ్ నవల, ఒక వ్యాససంకలనం, నాలుగు పిల్లల పుస్తకాలు వెలువడ్డాయి. 'దట్ లాంగ్ సైలెన్స్' అనే నవలకు సాహిత్య అకాడెమీ అవార్డుతోసహా మూడు నవలలకు బహుమతులు అందుకున్నారు. ఆమె రచనలు వివిధ భారతీయ భాషలలోకీ, యూరోపియన్ భాషలలోకీ అనువదించబడ్డాయి. సాహిత్యం, భాష, భారతీయ ఇంగ్లీషు రచనలు, స్త్రీవాదం మొదలైన విషయాల గురించి ఆమె పలు జాతీయ వార్తాపత్రికలలో, పత్రికలలో వ్యాసాలు రాశారు.

# మనం మారితే ప్రపంచం మారుతుంది!

ఇది గాంధీజీకి సంబంధించిన కథ. ఈనాడు ఇది గాంధీ గాథలో అంతర్భాగమై పోయింది. నేను ఈ కథను మొదట చదివినప్పుడు నాకు చాలా కొత్త. బహుశా అందువల్లనే అది నన్ను గాఢంగా ప్రభావితం చేసిందనుకుంటాను. గాంధీజీ అభిమాని అయిన మానాన్న, లూయీ ఫిషర్ రచించిన కొత్త గాంధీ జీవితచరిత్రను తెచ్చి ఇవ్వగానే అమితాసక్తితో ఆవురావురుమని చదివేశాను.

నేను చెబుతున్న సంఘటన, గాంధీ న్యాయవాదిగా దక్షిణాఫ్రికాకు వెళ్ళిన కొన్ని రోజులలోనే జరిగింది. ఆయన తన క్లయంట్ తరఫున డర్బన్ నుంచి ప్రెటోరియాకు ప్రయాణం చేయవలసి వచ్చింది. క్లయంట్ బుక్ చేసిన మొదటి తరగతి రైలుపెట్టెలోకి వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు. రాత్రి తొమ్మిది గంటల సమయంలో రైలు మారిట్జ్‌బర్గ్ స్టేషన్‌లో ఆగింది. ఒక ఆంగ్లేయుడు గాంధీజీ కూర్చున్న పెట్టెలోకి ఎక్కి, ఆయన్ను చూడగానే దిగిపోయాడు. కొంతసేపట్లో ఒక రైల్వే అధికారిని వెంటబెట్టుకుని వచ్చాడు. ఆ అధికారి గాంధీజీని మూడవ తరగతి పెట్టెలోకి వెళ్ళి కూర్చోమన్నాడు. దక్షిణాఫ్రికాలో నల్లజాతివారు మొదటి తరగతి పెట్టెలో ప్రయాణం చేయకూడదన్న మాట. అయితే, పెట్టె నుంచి దిగడానికి గాంధీజీ నిరాకరించాడు. "నా దగ్గర మొదటి తరగతి టిక్కెట్టు ఉన్నప్పుడు, మూడవ తరగతి పెట్టెలోకి ఎందుకు వెళ్ళాలి?" అని ఎదురు తిరిగాడు. "నేనుగా వెళ్ళేది లేదు," అని అధికారితో నిష్కర్షగా చెప్పేశాడు. "కావాలంటే మీరే గెంటేయండి," అన్నాడు. అధికారి వెళ్ళి పోలీసును వెంటబెట్టుకుని వచ్చి, గాంధీజీని లగేజ్‌తో సహా ప్లాట్‌ఫారం మీదికి తోసేశాడు.

గాంధీజీ రాత్రంతా వెయిటింగ్ రూంలోనే గడిపాడు. చలితో వణికి పోయాడు. తన ఓవర్ కోటు వున్న సంచీని రైల్వే అధికారులు భద్రపరచడానికి పట్టుకు వెళ్ళారు. దాని కోసం వారిని అడగడానికి ఆయనకు ఇష్టం లేదు. తనకెందుకిలా జరిగిందా అని ఆ రాత్రంతా నెమ్మదిగా ఆలోచించాడు.




దక్షిణాఫ్రికా జాతివివక్ష తను పాటించే దేశం. అంటే అక్కడ భారతీయులతో పాటు నల్ల జాతి వారందరి పట్లా వివక్ష తను పాటించే వారు. అది చాలా దారుణమైనది. కాని మరోమార్గం లేక అక్కడి ప్రజలు దానికి అల వాటు పడిపోయారు. ప్రభుత్వాన్ని ఎలా ఎదిరించగలరు? అయితే, ఆ దేశానికి కొత్తవాడైన ఆ ఇరవై నాలు గేళ్ళ యువకుడు, ఆ దురన్యాయాన్ని సహించాలా? అని తన్ను తాను ప్రశ్నిం చుకున్నాడు. ఆ దేశానికి పరాయి దేశం నుంచి వచ్చిన ఆయన, ఆ సంఘటన గురించి మరిచి పోయి వెళ్ళివుండవచ్చు. కానీ, "అలా వెళ్ళడం పిరికితనంతో పారిపోవడమే కాగలదు కదా? ఇక్కడే ఈ దురన్యాయాన్ని ఎదిరించి పోరాడడం నా కర్తవ్యం కాదా?" అని తనలో తాను తర్కించుకున్నాడు. ఆఖరికి-దక్షిణా ఫ్రికాలోనే ఉండి, ఆ దురన్యాయాన్ని ఎదిరించి పోరాడాలనే నిర్ణయానికి వచ్చాడు. గాంధీజీ ఆ నిర్ణయానికి వచ్చిన క్షణాలు ఆయన జీవితాన్ని మాత్రమే కాదు; ఒక దేశ చరిత్రను, నిజానికి ప్రపంచ చరిత్రనే మార్చివేశాయి!

ఆయనలో ఒక్క రాత్రిలో వచ్చిన ఆ మార్పు నాకొక గొప్ప అద్భుతంలా కనిపించింది. ఒక బక్కపలుచటి వ్యక్తి ప్రభుత్వానికి ఎదురు తిరగడానికి నిర్ణయించడం మాత్రమే కాదు; ఒక సామాన్య వ్యక్తి అంత పెద్ద కార్యం చేయ నని ఆలోచించడమే ఓ అద్భుతం!

ఈ సంఘటన నాకు మరో అద్భుత ఉదం తాన్ని గుర్తుకు తెచ్చింది. వ్యాధినీ, వృద్ధాప్యాన్నీ, మరణాన్నీ చూసి చలించిపోయి, మానవజాతి దుఃఖాన్ని పోగొట్టే మార్గాన్ని అన్వేషిస్తూ రాజ భోగాలనూ, భార్యా పిల్లలనూ, సర్వాన్నీ త్యజిం చిన యువరాజు కథ అది. అయితే, బుద్ధుడి జీవితంలోని ఆ సంఘటన ఎప్పుడో జరిగింది. ఇప్పుడాయన మహనీయుడు, అవతారపురు షుడు. ఆ భావన ఆయన్ను మనల నుంచి వేరు చేస్తుంది. అయితే, గాంధీజీ మనలాంటి మనిషే. అందరిలా ఆయన మన దగ్గరే ఉన్నట్టు భావించ వచ్చు. స్వీయచరిత్రలో అబ్బుర పరచే నిజాయితీతో, ఆయన వివరించిన ఆయన చేసిన తప్పులు, ఎదుర్కొన్న ఓటములు ఆయ న్నొక మామూలు మనిషిగానే చూపుతాయి. సమయం ఆసన్నమయినప్పుడు కఠిన నిర్ణ యాలు తీసుకునే ధైర్యం ఆయనలో ఉండే దన్నది ఒక్కటే తేడా.

దేవుళ్ళు-దేవతలు, దివ్యపురుషుల కథల్లో వచ్చే అద్భుతాలకు ఈ కథ ఏమాత్రం తీసి పోదని నేను భావిస్తున్నాను. మనం సాధారణ మనుషులుగా కనిపించినప్పటికీ, మనందరి లోనూ గొప్ప కార్యాలను సాధించే శక్తి నిగూ

ఢంగా ఉన్నదని ఈ కథ చాటుతున్నదని నాకు అనిపిస్తున్నది. మనం చేయవలసిందల్లా మన లోని ఆ అంశాన్ని గుర్తించి, దానిని ఉపయోగించడం మాత్రమే. ఆ విధంగా మన జీవితాల్లోనూ, మన చుట్టూ వున్న వారి జీవితాల్లోనూ మార్పు తీసుకురావచ్చు. గాంధీజీ చేసినది అదే. అది నాకో నిజమైన అద్భుతంలా కనిపిస్తున్నది.

చాలా సంవత్సరాల తరవాత నేను దక్షిణాఫ్రికాలో, ప్రెటోరియా నుంచి కేప్‌టౌనుకు ప్రయాణం చేస్తూ మారిట్జ్‌బర్గ్ గుండా వెళ్ళవలసి వచ్చింది. ఆ స్టేషన్ ప్లాట్‌ఫారం మీద ఆనాటి రాత్రి ఒక మనిషి తీసుకున్న నిర్ణయం ద్వారా చరిత్రే మారిపోయిన విషయం తలుచుకుని పరవశం చెందాను. గాంధీజీ అక్కడే ఉండి, జాతి వివక్షను వ్యతిరేకించి జరిపిన పోరాటం పర్యవసానంగా ఆ దేశంలో అనేక మార్పులు వచ్చాయి. అక్కడే ఆయన సత్యం, అహింస అనే రెండు నూతన ఆయుధాలను కనుగొన్నాడు. వాటి నుంచే సత్యాగ్రహం అనే మహత్తర ఆయుధం ఆవిర్భవించింది. భారతదేశానికి తిరిగి వచ్చాక సత్యాగ్రహ మార్గంలో పోరాటం సాగించి దేశానికి స్వాతంత్ర్యం సాధించి పెట్టాడు!

గాంధీజీకి రైల్వే అధికారులతో ఏర్పడిన వింత అనుభవం తరవాత జరిగిన విషయాలు కూడా చాలా ఆసక్తికరమైనవే. జాతి వివక్షతను వ్యతిరేకించి పోరాడాలని నిర్ణయించాక, గాంధీజీ అక్కడున్న భారతీయుల సమావేశం ఏర్పాటు చేశాడు. అందరూ సమైక్యంగా న్యాయ విరుద్ధమైన చట్టాలకు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపు నిస్తూ, అంతకు ముందు అందరూ నాలుగు సూత్రాలను పాటించాలని విజ్ఞప్తి చేశాడు. మొదటిది వ్యాపారంలో అబద్ధాలు చెప్పకూడదు. (దక్షిణాఫ్రికాలోని ఎక్కువ మంది భారతీయులు వ్యాపారులే) రెండవది, కుల

## మన దేశం క్విజ్

### ఈ నెలలో మహాత్మా గాంధీని స్మరించుకుందాం

1. మహాత్మా గాంధీని 'జాతిపిత'గా మొదట అభివర్ణించిన వారెవరు?

2. గాంధీజీ ఒకే ఒక్క సారి కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించారు. ఆ మహాసభ ఎక్కడ జరిగింది? ఎప్పుడు?



3. గాంధీజీ తన ఆశ్రమాన్ని మొట్ట మొదట ఎక్కడ స్థాపించారు? ఏ సంవత్సరంలో?

4. గాంధీజీ తన 'రాజకీయ గురువు'గా ఎవరిని భావించారు?

5. ఒక వైస్రాయ్‌తో గాంధీజీ ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. ఆ వైస్రాయ్ ఎవరు? ఒప్పందం ఎప్పుడు సంతకమయింది?

(సమాధానాలు 74వ పేజీలో)

మత భేదాలు పాటించకూడదు. మూడవది, మెరుగైన పరిశుభ్రమైన అలవాట్లు నేర్చుకోవాలి. నాలగవది, ఇంగ్లీషు నేర్చుకోవాలి. ఆ మాట వినగానే భారతీయులు గందరగోళంలో పడివుంటారు. "ఈ నిబంధనలకూ, జాతి వివక్షపోరాటానికీ సంబంధం ఏమిటి?" అన్న అనుమానం కలగవచ్చు. సన్నిహిత సంబంధం ఉన్నదనే గాంధీజీ భావించాడు. ఎదుటివారిని వ్యతిరేకించి పోరాడే ముందు, మన తప్పులను సరిదిద్దుకుని మనల్ని మనం మెరుగు పరుచుకోవాలన్నదే గాంధీజీ ఆశయం.



నేను పెరిగి పెద్దయి, గాంధీజీని గురించి మరింత తెలుసుకున్నప్పుడే ఈ సంఘటనలోని ప్రాముఖ్యతను గ్రహించ గలిగాను. మనం మనల్ని మార్చుకోకుండా ప్రపంచాన్ని మార్చలేమన్న గొప్పసత్యాన్ని చెప్పడం వల్ల, ఈ కథ ఈనాటికీ పనికివస్తుందనే భావిస్తున్నాను. అర్థవంతమూ, ఆచరణీయమూ అయిన ఉన్నత నైతికసూత్రం అది. గాంధీజీ జీవిత సందేశ సారం అందులో ఇమిడి ఉన్నది. నైతిక సూత్రాలు అన్నవి కేవలం మత గ్రంథాలలో చదవడానికి మాత్రమే కావనీ; అనుదిన జీవితంలో ఆచరించ వలసినవి అనీ విశ్వసించిన మహనీయుడాయన.

ఈనాడు మనం గాంధీజీని మహాత్ముడిగా, ఒక సాధువుగా పరిగణిస్తున్నాం. ఎక్కడ చూసినా ఆయన విగ్రహాలను ప్రతిష్ఠించి పూల మాలలతో అలంకరిస్తున్నాం. ఆయన చిత్ర పటాలకు పూలదండలు వేస్తున్నాం. ఆయన సూక్తులను ఉటంకిస్తున్నాం. అయితే గాంధీజీ సాధువు కాదు. తనకు తానే ఉన్నతమైన నైతిక విలువలను ఏర్పరచుకొని, తాను చెప్పేదానిని అందరికన్నా ముందు తానే ఆచరించి చూపిన ఒక అసామాన్యమైన వ్యక్తి. ఆయన బోధించిన నైతిక సూత్రాలన్నీ ఆచరణ యోగ్యమైనవి. అందుకే ఆయన వ్యక్తిగత పరిశుభ్రతకూ, వ్యాపారంలో నిజాయితీకీ అంతటి ప్రాముఖ్యతను ఇచ్చాడు. గాంధీజీని మానవాతీత వ్యక్తిగా చూడడం దయనీయం. తన్ను తాను మెరుగైన మనిషిగా మలుచుకోవడానికి నిరంతరం ప్రయత్నించిన ఒక మనిషిగా ఆయన్ను చూడగలగాలి. అప్పుడే ఆయన సాధించినవన్నీ, ప్రయత్నిస్తే మనం అందరం కూడా సాధించగలమన్న విషయం అవగతమవుతుంది. మారిట్జ్‌బర్గ్ రైల్వే స్టేషన్‌లో గాంధీజీకి ఎదురైన క్షణాలు మనందరికీ తారసపడవచ్చు. అయితే, మనలో చాలా మంది అలాంటి క్షణాలను జారవిడుచుకుంటాం. మనకూ, ఆ మహానుభావుడికీ ఉన్న తేడా అదే!

# బీర్బల్-రాజుగారి పాన్‌వాలా

తాంబూలం వేసుకోవడం అంటే అక్బర్ చక్రవర్తికి మహాప్రీతి. ముఖ్యంగా షౌకత్ అలీ కట్టి ఇచ్చే పాన్ వేసుకోవడం అంటే ఎంతో ఇష్టం. తనకు నచ్చే విధంగా పాన్ కట్టి ఇచ్చే షౌకత్ అలీని తరచూ తెగ మెచ్చుకునేవాడు. అందుకు భారీకాయంగల షౌకత్ అలీ వంగి వంగి సలాం చేస్తూ, ''మహా నేర్పరి అయిన మా తండ్రి నుంచి ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే నేర్చుకున్న విద్య కదా అది! ఆ మాటకొస్తే పాన్ కట్టే నేర్పు మా రక్తంలోనే జీర్ణించుకుపోయింది. అది వంశపారంపర్యంగా వస్తూన్న విద్య. ప్రభువులకు సంతోషం కలిగిస్తే ఈ సేవకుడి జన్మ ధన్యమైనట్టే,'' అనేవాడు పట్టరాని ఆనందంతో.



చక్రవర్తి ఎక్కడికి వెళ్ళినా షౌకత్‌ను వెంట బెట్టుకుని మరీ వెళ్ళేవాడు. ఆయన భోజనం అయినా మానేయగలడేమోగాని, పాన్ వేసుకోవడం మాత్రం వదిలేవాడు కాడు. ఇలా మూడేళ్ళు హాయిగా గడిచిపోయాయి.

ఒకనాడు షౌకత్ పొరబాటున తమలపాకులకు సున్నం కాస్త ఎక్కువ రాయడంతో పాన్ వేసుకున్న అక్బర్ నాలుక భగ్గున మండింది. దాన్ని తుపుక్కున ఉమ్మేసి, ''నీ పాన్‌తో నాలుక మండి పోయింది. పాన్ కట్టడంలో ఈ రాజ్యంలో నాకన్నా మొనగాడు లేడని గొప్పలు చెప్పుకుంటావ్. సిగ్గులేక పోతేసరి,'' అని మండిపడ్డాడు అక్బర్.

షౌకత్ భయంతో వణికిపోయాడు.

అక్బర్ చక్రవర్తి నాలుకను మళ్ళీ మళ్ళీ చూడడానికి ప్రయత్నిస్తూ, ''షౌకత్, ఇప్పుడే వెళ్ళి, నీ సంచీ నిండుగా సున్నం నింపుకుని రా. సంచీ నిండుగా. అర్థమయింది కదా?'' అన్నాడు. చక్రవర్తి తనకు ఏ శిరశ్ఛేదమో, జైలు శిక్షో విధించనందుకు షౌకత్ మనసులో అల్లాకు కృతజ్ఞతలు చెప్పుకుంటూ అక్కడి నుంచి బయలుదేరాడు.

సంచీ నిండుగా సున్నం అడిగే సరికి కొట్టువాడు, ''అంత ఎందుకూ?'' అన్నాడు.

"నాకు తెలియదు. చక్రవర్తి తెమ్మన్నారు, అంతే!" అంటూ షౌకత్ అప్పుడే అక్కడికి వచ్చిన మహేశ్‌దాస్‌ను చిరునవ్వుతో పలకరించాడు.

"అవునూ, చక్రవర్తి నిన్ను సంచీ నిండుగా సున్నం తెమ్మన్నారట కదా. ఎందుకూ?" అని అడిగాడు మహేశ్‌దాస్.

"అదే, నాకూ అంతుబట్టడం లేదు మిత్రమా!" అన్నాడు షౌకత్.

"ఇంతకు ముందెప్పుడైనా ఇలా తెమ్మన్నారా?" అని అడిగాడు మహేశ్.

"లేదు," అన్నాడు షౌకత్.

"దేనికైనా మంచిది. కడుపునిండా నెయ్యి తాగి వెళ్ళు," అన్నాడు మహేశ్.

"ఇప్పుడే నాపొట్ట బానలా ఉంది. ఇంకా నెయ్యి తాగమని పరిహాసం చేస్తున్నావా?" అని అడిగాడు షౌకత్.

"పరిహాసం కాదు గాని, నీ మంచి కోరే చెబుతున్నాను. చక్రవర్తి సమక్షానికి వెళ్ళే ముందు కడుపు పట్టేంత నెయ్యి తాగి మరీ వెళ్ళు. అదే నీకు ప్రాణరక్ష. నాకు అవతల బోలెడు పనులున్నాయి," అంటూ వెళ్ళిపోయాడు మహేశ్‌దాస్.

షౌకత్ ఆలోచనలో పడ్డాడు. సున్నం సంచీతో ఇల్లు చేరగానే, భార్యను నెయ్యి దుత్తను తీసుకురమ్మని, కడుపునిండా నెయ్యి తాగేశాడు. అప్పటికే ఆలస్యమయిందన్న ఆదుర్దాతో, భార్య ఏదో చెబుతున్నప్పటికీ అదంతా వినిపించుకోకుండా, అపశోపాలు పోతూ వెళ్ళి, సున్నం సంచీని చక్రవర్తి ముందు పెట్టాడు.



"వచ్చావా," అంటూ అక్బర్ చక్రవర్తి అతని ముఖమైనా చూడకుండా, "వీణ్ణి వెలుపలికి తీసుకుపోయి, వీడి చేత ఈ సున్నం తినిపించండి," అని భటులను ఆజ్ఞాపించాడు.

"చచ్చిపోగలను ప్రభూ! సున్నం కడుపును దహించేస్తుంది," అని ఏడ్వసాగాడు షౌకత్.

"అదే, నీకు సరైన శిక్ష!" అన్నాడు అక్బర్ చక్రవర్తి.

భటులు షౌకత్‌ను వెలుపలికి లాక్కెళ్ళి, సున్నం తినమని ఆజ్ఞాపించారు.

రాజాజ్ఞ గనక, షౌకత్ రెండు గుప్పెళ్ళ సున్నం తిని సొమ్మసిల్లి పడిపోయాడు. అంతలో అక్బర్ చక్రవర్తి అక్కడికి వచ్చాడు.



ఆయన షౌకత్‌ను చూడగానే, ''ఇంకా ప్రాణాల తోనే ఉన్నావా?'' అని అడిగాడు.

అతి ప్రయత్నం మీద లేచి కూర్చుంటూ, ''నెయ్యి తాగడం వల్ల బతికిపోయాను ప్రభూ,'' అన్నాడు షౌకత్.

''నెయ్యి ఎందుకు తాగావు?'' అని అడిగాడు అక్బర్ చక్రవర్తి.

''సున్నం కొంటూంటే అక్కడికి వచ్చిన మహేశ్‌దాస్ అనే యువకుడు నెయ్యి తాగి తమ దగ్గరికి వెళ్ళమని సలహా ఇచ్చి పుణ్యం కట్టుకున్నాడు, ప్రభూ!'' అన్నాడు షౌకత్.

''ఎవడా మహేశ్‌దాస్? వెళ్ళి వెంటనే పిలుచుకురా వాణ్ణి,'' అని ఆజ్ఞాపించాడు అక్బర్.

షౌకత్ వెళ్ళి కొంతసేపటికి మహేశ్‌దాస్‌ను వెంటబెట్టుకుని వచ్చాడు. అతన్ని చూడగానే, ''బీర్బల్, ఇదంతా నీ పనా? షౌకత్‌ను నెయ్యెందుకు తాగిరమ్మన్నావు?'' అని అడిగాడు అక్బర్ కోపంగా.

''నెయ్యి తాగి రావద్దని ప్రభువులు ఆజ్ఞాపించలేదు కదా. ప్రభువులు క్షమించాలి.... తమరు సంచీ నిండుగా సున్నం తెమ్మన్నారంటే, అది అతన్ని శిక్షించడానికే అని ఊహించి నెయ్యి తాగి రమ్మన్నాను. లేకుంటే ఈపాటికి అతడు చచ్చేవాడు,'' అన్నాడు బీర్బల్.

''చస్తే నీకేం? పాన్‌లో సున్నం ఎక్కువ కలిపి నా నాలుక పొక్కిపోయేలా చేశాడు. వాడికీ శిక్ష కావాలి,'' అన్నాడు అక్బర్ కోపంగా.

''షౌకత్ చస్తే నాకేం లేదుగానీ, తమకే నష్టం. అతడు మూడేళ్ళుగా తమ సేవలో ఉన్నాడు. ఎప్పుడూ తప్పు చేయలేదు. అతడు కట్టిచ్చే పాన్ అద్భుతంగా ఉంటుందని తమరే నాతో అనేక సార్లు చెప్పారు. అలాంటి వాడు పోతే, మీకు అంత బాగా పాన్ కట్టిచ్చే వారెవరు? మిమ్మల్ని నమ్ముకున్నవాడు. ఏదో పొరబాటు చేశాడు. తప్పు చేయడం మానవ సహజం. తెలియక చేసిన తప్పును క్షమించడం తమవంటి చక్రవర్తుల గొప్పగుణం!'' అన్నాడు బీర్బల్.

షౌకత్ మళ్ళీ వంగి సలాం చేశాడు.

అక్బర్‌చక్రవర్తి దాన్ని చూసి, ''వంగి నీ నుదుటితో నేలను తాకమని చెప్పివుంటే సరిపోయేది. అదే నీకు సరైన శిక్ష,'' అని క్షణం ఆగి, ''సరి, సరి. త్వరగా, నాకూ, బీర్బల్‌కూ మంచి పాన్ కట్టివ్వు,'' అన్నాడు నవ్వుతూ.



# శివదాసు కవిత్వం

గంగవరం గ్రామంలో శివదాసు అనే కవి ఉండేవాడు. ఆయన కవిత్వం విన్నవారెవరూ ఆయన్ను మెచ్చుకోకుండా ఉండలేరు. సరళ మైన భాషలో, అందమైన భావచిత్రాలతో అందరినీ అలరించేది ఆయన కవిత్వం.

ఆయన కవిత్వం విన్న గ్రామస్థులు, ''శివ దాసూ, నువ్వు ఒకసారి వెళ్ళి రాజుగారిని దర్శించి, నీ కవిత్వం వినిపిస్తే నీకు కనకాభి షేకం జరిపిస్తాడు. నీ పేదరికం తీరుతుంది,'' అంటూండేవారు.

అందుకు శివదాసు, ''నా కవిత్వం ఆ స్థాయిలో ఉన్నప్పుడు తప్పక వెళ్ళి మహా రాజును దర్శిస్తాను,'' అని వినయంగా సమా ధానం చెప్పేవాడు.

శివదాసు కవిత్వం మధురంగా ఉంటుం దన్న విషయం ఆనోటా ఈనోటా పాకి కనక పురం జమీందారు భువనశంకరుడి చెవిన పడింది. భువనశంకరుడికి కవిత్వంలో మంచి ప్రవేశముంది. ఆయన శివదాసును ప్రత్యేకంగా పిలిపించి కవిత్వం విన్నాడు. శివదాసు కవిత్వం జమీందారును ఎంతగానో ఆకట్టుకున్నది. ఆయన శివదాసుకు శాలువాకప్పి, విలువైన కానుకలతో సత్కరించి, ''అప్పుడప్పుడు వచ్చి, మీ కవిత్వం వినిపించండి. లేకుంటే నేనే మీ గ్రామానికి రావలసి ఉంటుంది,'' అన్నాడు.

''అయ్యో! ఎంత మాట! నేనే వచ్చి కలు స్తూంటాను,'' అని వినమ్రతతో సెలవు తీసు కుని గ్రామం చేరాడు శివదాసు.

ఆయన వచ్చాడని తెలియగానే కొందరు గ్రామపెద్దలు వచ్చి, శివదాసును అభినం దించి, ''శివదాసూ, మేము చెబితే ఇన్నాళ్ళు పట్టించుకోలేదు. నీలోని ప్రతిభకు జమీం దారు సత్కారమే తార్కాణం. ఇప్పటికైనా వెళ్ళి రాజుగారిని దర్శించు,'' అని ప్రోత్సహించారు.

ఎస్. శివనాగేశ్వర రావు




''అందుకు ఇంకా కొంత సమయం ఉంది,'' అని దాటవేశాడు శివదాసు.

మూడు నెలల తరవాత మళ్ళీ ఒకనాడు జమీందారు నుంచి శివదాసుకు పిలుపు వచ్చింది. ఆయన కనకపురం వెళితే జమీందారు అక్కడ లేడు. కనకపురానికి ఉత్తరంగా కొద్దిదూరంలో ప్రవహించే గంగానదీ తీరంలో జమీందారుకు పెద్ద తోట, భవనం ఉన్నాయి. ఇప్పుడాయన అక్కడ బస చేస్తున్నాడని తెలియడంతో శివదాసు అక్కడికి వెళ్ళాడు.

శివదాసు వినిపించిన సుమధుర కవిత్వానికి ముగ్ధుడైన జమీందారు, ''ఇంత గొప్ప కవిత్వం చెప్పిన తమకు ఈ భవనంలో కొన్నాళ్ళు ఆతిథ్యమిచ్చి గౌరవించాలనుకుంటున్నాను. నా కోరిక మన్నిస్తారు కదూ,'' అన్నాడు. శివదాసు అందుకు సమ్మతించగానే జమీందారు ఆయనకు అక్కడ కావలసిన ఏర్పాట్లన్నీ సమకూర్చాడు.

మరునాడు సూర్యోదయానికి ముందే లేచి శివదాసు నదీ తీరానికి వెళ్ళాడు. చల్లని వాతావరణం. గంగానది రెండు తీరాలను అనుకుని నిండుగా, గంభీరంగా ప్రవహిస్తున్నది. ఆ ప్రవాహ వేగం శివదాసు మనసులో ఓంకారనాదంలా తోచింది. అలాగే కూర్చుని కళ్ళు మూసుకున్నాడు. కొంత సేపయ్యాక కళ్ళు తెరిచి చూస్తే సూర్యోదయ కిరణాలు పడడంతో ఎదుట స్వర్ణ ప్రవాహం సాగుతున్నట్టనిపించింది శివదాసుకు. ఆయన మనసులో కవితాధార పెల్లుబికింది. దానిని మననం చేసుకుంటూ భవనానికి వచ్చి తాళపత్రంలో లిఖించాడు. దానిని చదువుతూంటే ఆయనలో అలౌకికమైన ఆనందం కలిగింది.

అప్పటి నుంచి రోజూ ఉదయం, సాయంకాలం నదీ తీరానికి వెళ్ళి గంగను దర్శిస్తూ, అక్కడి సుందర వాతావరణాన్నీ; ప్రాణికోటికి ప్రాణంపోసి రక్షించే గంగమ్మ తల్లి కరుణనూ వర్ణిస్తూ చాలా పద్యాలు రచించాడు. వారం రోజుల తరవాత జమీందారు అనుమతి పొంది కానుకలతో స్వగ్రామం చేరాడు.

శివదాసుకు తాను రాసిన కవిత్వం చదువుతూంటే, అది ఇప్పుడు రాజుగారికి వినిపించ తగ్గ స్థాయిలో ఉందన్న నమ్మకం కలిగింది. రాజదర్శనం చేసుకోవాలనుకున్నాడు. ఆయన నిర్ణయం విని, గ్రామ పెద్దలు సంతోషించారు.

రాజధానికి బయలుదేరిన శివదాసును సాగనంపడానికి వచ్చిన గ్రామపెద్దల్లో ఒకా

యన, ''ఇన్నాళ్ళకు మా మాట విని నువ్వు రాజ దర్శనానికి వెళుతున్నందుకు చాలా సంతోషం,'' అన్నాడు.

పక్కనే ఉన్న మరొక పెద్దమనిషి, ''రాజ సన్మానం పొంది, ఆస్థానకవివయ్యాక, పుట్టి పెరిగిన ఊరిని మరిచి పోవద్దు శివదాసూ,'' అన్నాడు. ''మన శివదాసుది అలా మరిచి పోయే స్వభావం కాదులే,'' అన్నాడు మూడో పెద్దమనిషి.

''అది ఇప్పుడే ఎలా చెప్పగలం? సంప దలు కలిగాక మనిషి ఎలా మారిపోతాడో, ఏమో?'' అన్నాడు నాలుగో వ్యక్తి.

''ఒక్క సంపద లేనా? భోగభాగ్యాలతో పాటు గొప్ప గొప్ప వాళ్ళతో పరిచయాలు, సంబంధ బాంధవ్యాలు ఏర్పడతాయి కదా? అప్పుడు మామూలు మనుషులమైన మనం గుర్తుండడం గొప్ప విషయమే!'' అన్న ఇంకొక పెద్దమనిషి మాటలకు అక్కడ చేరిన వారం దరూ ఆమోదిస్తున్నట్టు గలగలా నవ్వారు.

చిన్నగా నవ్వుతూ గ్రామపెద్దలకు వీడ్కోలు పలికి శివదాసు ముందుకు అడుగులు వేస్తు న్నాడేగాని, హెచ్చరికల్లాంటి వారి మాటలు విన్న తరవాత ఆయన మనసులో అలజడి మొదలయింది. అంతర్మథనం ఆరంభమ యింది. ఆ గందరగోళంలో రాజధాని కేసి వెళ్ళకుండా గంగానదీ తీరం చేరాడు. నదిని చూడగానే ధారలు ధారలుగా కన్నీరు కార సాగింది. ''తల్లీ, నన్ను క్షమించు. నిన్ను కీర్తిస్తూ, నీ మహిమను కొనియాడుతూ నేను కవిత్వం రచించింది ఎందుకు? దానిని




అంకితమిచ్చి రాజాశ్రయం పొందడానికా? భోగభాగ్యాలనుభవిస్తూ అహంకారినని పేరు తెచ్చుకోవడానికా? ఐహిక సుఖాలకులోనై ఆప్తులకు దూరం కావడానికా? కాదు. కానే కాదు. ఆ కవిత్వం మనిద్దరి మధ్య ఉన్న తల్లీ కొడుకుల అనుబంధానికి సంకేతం! దానిని ఎవరూ మెచ్చుకోనవసరం లేదు. ఎవరి సన్మా నాలూ అవసరం లేదు. నీకే సమర్పిస్తున్నాను. స్వీకరించి నా అపరాధాన్ని క్షమించు,'' అంటూ కళ్ళు మూసుకుని తాళపత్రాలను ఒక్కొక్క టిగా నదిలోకి జారవిడిచాడు.

తాళపత్రాలన్నిటినీ గంగామాతకు సమ ర్పించాక, కళ్ళు తెరిచిన శివదాసుకు ఒక అద్భుత దృశ్యం గోచరించింది. ఆయన విడి చిన తాళపత్రాలన్నీ సువర్ణ పత్రాలుగా మారాయి. అవి ప్రవాహవేగానికి కొట్టుకు

పోకుండా శివదాసుకు చేరువగా నీళ్ళపై తేలియాడసాగాయి. ఆ దృశ్యం చూసిన శివదాసుకు అది నిజమా? కలా? అన్న సందేహం కలిగింది. ఒక పత్రం అందుకుని చూశాడు. అతని పద్యం అందులో అందంగా లిఖించబడి ఉన్నది!

అదే సమయంలో, ''పదిమందికీ చేరువయినప్పుడే ఏ కళకైనా సార్థకత సిద్ధిస్తుంది. అమృత తుల్యమైన నీ కవిత్వమూ అంతే. అనవసరమైన అయోమయం వదిలిపెట్టి కొంచెం సంయమనం పాటించు. అంతా శుభమే జరుగుతుంది,'' అన్న మృదువైన కంఠస్వరం వినిపించింది.

శివదాసు పత్రాలన్నిటినీ తీసుకుని భక్తితో కళ్ళకద్దుకుని వెనుదిరిగాడు. దూరంలో జమీందారు పరివారంతో రావడం కనిపించింది. ఆయన శివదాసును సమీపించి, ''యథాలాపంగా ఉద్యానవన భవనానికి వచ్చిన నాకు, మీరు వస్తున్నారని తెలిసి సంతోషంగా ఎదురు చూశాను. కొంత సేపయ్యాక నౌకర్లు వచ్చి తమరు ఇక్కడ ఉన్నట్టు చెప్పారు. గంగామాత తమ కవిత్వాన్ని ఆశీర్వదించిన అద్భుత ఉదంతం విని పరవశించాను. రండి వెళదాం,'' అన్నాడు.

''క్షమించండి. నేను ఎక్కడికీ రాలేను. కరుణించి ఇక్కడ ఒక కుటీరం నిర్మించి ఇవ్వండి చాలు,'' అన్నాడు శివదాసు.

జమీందారు ఆయన కోరికను నెరవేర్చి, రాజధానికివెళ్ళి శివదాసు తాళపత్రాలను స్వర్ణ పత్రాలుగా మార్చిన గంగామాత అద్భుత మహిమ గురించి రాజుకు చెప్పాడు. సాహితీ ప్రియుడైన రాజు స్వయంగా వచ్చి శివదాసును కలుసుకుని స్వర్ణతాళపత్రాలలోని కవిత్వాన్ని చదివి వినిపించమని విని తన్మయత్వం చెందాడు. ఆస్థానకవి పదవిని అలంకరించమని ఆహ్వానించాడు. అయితే, శివదాసు, ''గంగామాతకు ఈ నదీ తీరాన ఒక గుడి కట్టించి, ఆ జ్ఞానగంగను సేవిస్తూ ఇక్కడే ఉండిపోయే భాగ్యం నాకు కలిగించండి. మీ మేలు మరిచిపోను,'' అని వేడుకున్నాడు.

త్వరలో అక్కడ స్వర్ణపత్రాలుగల జ్ఞాన గంగ ఆలయం నిర్మించబడింది. శివదాసు అక్కడే నిరాడంబరంగా జీవిస్తూ మరిన్ని కృతులు రచించి ప్రజలకు అందించాడు.



# చందమామ ఇండియా క్విజ్ - 9

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

ఈ నెల క్విజ్ విజ్ఞాన-సాంకేతిక శాస్త్రాలకు సంబంధించినది. మూడు సమాధానాలలో ఒకటి సరైనది. సరైన దాన్ని తీసుకోండి.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్-9 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. అక్టోబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. డిసెంబర్ 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. భారతీయ అంతరిక్ష పరిశోధనా సంస్థ ఎప్పుడు ఏర్పాటు చేయబడింది?
   ఎ. 1966 బి. 1969 సి. 1971 డి. 1975
2. ఇస్రో అంతరిక్షంలోకి పంపిన తొలి ఉపగ్రహం పేరేమిటి?
   ఎ. రోహిణి బి. భాస్కర సి. ఆర్యభట డి. త్రిశూల్
3. మన ముగ్గురు విజ్ఞాన శాస్త్రవేత్తలు నోబెల్ బహుమతి అందుకున్నారు. వారిలో సి.వి. రామన్, హర్‌గోవింద్ ఖొరానా ఇద్దరు. మూడవ బహుమతీ గ్రహీత ఎవరు?
   ఎ. హెచ్.జె. బాబా బి. సి. చంద్రశేఖర్ సి. ఎస్.ఎన్. బోస్ డి. బీర్బల్ సాహ్ని
4. 'టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చ్' వ్యవస్థాపకుడు ఎవరు?
   ఎ. భట్నగర్ బి. భాభా సి. సాహా డి. సారాభాయ్
5. విక్రమ్ సారాభాయ్ అంతరిక్షకేంద్రం ఎక్కడ ఉన్నది?
   ఎ. తిరువనంతపురం బి. మహేంద్రగిరి సి. బెంగుళూరు డి. ముంబై
6. మనదేశంలో అత్యంత ప్రాచీనమైన ఇంజినీరింగ్ కాలేజ్ ఎక్కడ ఉన్నది?
   ఎ. బెంగుళూరు బి. రూర్కీ సి. వారణాసి డి. ముంబై

# స్మిత్, తిరిగి వెళ్ళిపో!

ఆ దృశ్యం చాలా మందికి 1927లో భారత స్వాతంత్ర్య సమరయోధులు సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా జరిపిన పోరాటాన్ని గుర్తు చేస్తుంది. అనాడు బ్రిటిష్ పాలకులు నియమించిన సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా, ''సైమన్, తిరిగి పో!'' అంటూ నినాదాలు చేస్తూ ఎలాగైనా స్వాతంత్ర్యం సాధించి తీరాలన్న పట్టుదలతో స్వాతంత్ర్య యోధులు పోరాడారు.

అయితే, ఇప్పుడు చెబుతున్న దృశ్యం 1927 నాటికి సంబంధించినదీ కాదు. పోరాటం జరిపిన వారు స్వాతంత్ర్య యోధులూ కారు. ఇది మన స్వతంత్ర భారతంలో పదేళ్ళ క్రితమే జరిగింది. పోరాటం సాగించిన వారు మత్స్యకారులు. ఆ ఉద్యమంలో స్త్రీ పురుషులు దాదాపు రెండువేల మంది పాల్గొన్నారు. బోర్డులను పట్టుకుని నినాదాలు చేశారు. బోర్డుల మీది సందేశాలలో, మాటలలో కొద్దిగా తేడా కనిపించినప్పటికీ వాటి సారాంశం మాత్రం ఒక్కటే: ''స్మిత్, తిరిగి వెళ్ళిపో!''

'స్మిత్ కంజెనెరేషన్' అనే ఒక ప్రైవేటు కంపెనీ కర్నాటక సముద్ర తీరంలో బెంగ్రే గ్రామ సమీపంలో విద్యుత్తును ఉత్పత్తి చేయడానికి ఒక పెద్ద యంత్రాన్ని నెలకొల్పడానికి ఉద్దేశించింది. బెంగ్రే గ్రామానికీ, పరిసర గ్రామాలకూ చెందిన మత్స్యకారులు దానిని తీవ్రంగా ప్రతిఘటించారు.

ఆ రోజు కంపెనీకి చెందిన కొందరు అధికారులు–అసలు విషయాన్ని దాచి, పెద్ద యంత్రం ఆర్థికాభివృద్ధికి దోహదం చేయగలదని బెంగ్రే ప్రాంత మత్స్యకారులకు వివరించడానికి స్థానిక కలెక్టర్ కార్యాలయ ప్రాంగణానికి చేరారు.

అయితే, తరతరాల అనుభవంగల మత్స్యకారులకు అసలు జరగబోయేది ఏమిటో బాగా తెలుసు. కంపెనీ అధికారులు మాట్లాడడం పూర్తిచేశాక మత్స్యకారులు తమకు సముద్రం అంటే కేవలం ఆదాయవనరు మాత్రమే కాదనీ; దానికీ, తమకూ తల్లీ బిడ్డల విడదీయరాని అనుబంధం ఉన్నదనీ, సముద్రం తమకు దేవత అనీ వివరించారు.

మత్స్యకారుల హక్కుల పరిరక్షణకు పాటు పడుతున్న కొన్ని స్వచ్ఛంద సేవా సంస్థల సభ్యులు కూడా ఆనాటి సమావేశానికి హాజరయ్యారు. వాళ్ళ సాయంతో, మత్స్యకారులు పెద్ద యంత్రం వస్తే సముద్రానికీ, తీరంలోని ఇసుకకూ కలిగే ముప్పు గురించి స్మిత్‌కూ, ఆయన మనుషులకూ తెలియ జెప్పారు. యంత్రం నుంచి వెలువడే చమురు సముద్ర జలాలను కలుషితం చేస్తుందనీ, అందువల్ల సముద్రంలోని చేపలు ఊపిరాడక చచ్చిపోగలవనీ చెప్పారు. ఒక వేళ చేపలు చచ్చిపోక



పోయినా, యంత్రం పుట్టించే శబ్దం వాటిని దూరంగా తరుమగొడుతుందనీ, ఆ తరవాత తాము పట్టడానికీ, తమ స్త్రీలు అమ్మడానికీ ఏమి మిగులుతాయని ప్రశ్నించారు.

అదే సమయంలో కంపెనీ మనుషులు అక్కడ యంత్రాన్ని ఏర్పాటు చేయడం వల్ల, బెంగ్రేకూ, పరిసర గ్రామాలకూ సమకూరనున్న ప్రయోజనాల గురించి వివరించే నివేదికను అందించారు. నిజానికి ఆ యంత్రాన్ని అక్కడ నెలకొల్పడం ఆ ప్రాంతానికి ఎంతగానో మేలు చేస్తుందనే తప్పుడు సమాచారాన్ని అందించి ప్రజలను నమ్మించి, వ్యతిరేకతను పోగొట్టాలని ప్రయత్నించారు. దాన్ని చదివి చూసిన స్వచ్ఛంద సేవా సంస్థల ప్రతినిధులు అందులోని వివరాలు పూర్తి వాస్తవాలు కావని గ్రహించారు.

కంపెనీ మనుషులు తమ నివేదికను సమర్పించాక, మత్స్యకారుల మిత్రులైన స్వచ్ఛంద సేవాసంస్థల ప్రతినిధులు దానికి తీవ్రమైన అభ్యంతరాలను తెలియజేశారు. నివేదిక సరైనది కాదని చెప్పారు. అది తీరంలో ఏర్పడే దీర్ఘకాల పర్యవసానాలను పరిగణనలోకి తీసుకోలేదని వివరించారు.

"స్మిత్, తిరిగివెళ్ళిపో," లాంటి నినాదాలతో కలెక్టర్ కార్యాలయ ప్రాంతం మారుమోగింది. ఒకే గందరగోళం నెలకొన్నది. ఎట్టి పరిస్థితులలోనూ స్మిత్ పెద్దయంత్రాన్ని నెలకొల్పనీయరాదని మత్స్యకారులు గట్టి నిర్ణయం తీసుకున్నారు.

సమావేశం ముగిసింది. మరునాడు వార్తా పత్రికలు ఈ సమావేశం గురించి వార్తలు ప్రచురించాయి. చాలా పత్రికలు మత్స్యకారులకూ, స్వచ్ఛంద సేవా సంస్థలకూ తమ మద్దతు తెలిపాయి.

అయితే, కొన్ని రోజులు గడిచాక బెంగ్రేలో యంత్రం నెలకొల్పే పనులు ప్రారంభించమని ప్రభుత్వం స్మిత్ కంపెనీని ఆదేశించింది. మత్స్యకారుల అభిప్రాయాలను ఏమాత్రం పట్టించుకోలేదన్నమాట!

అయినా, మత్స్యకారులూ, స్వచ్ఛంద సేవాసంస్థలూ తమ పోరాటాన్ని మానుకోలేదు. వ్యతిరేక ఉద్యమాన్ని మరింత ఉధృతం చేశారు. ప్రముఖులను కలుసుకుని విషయం చెప్పారు. ఉత్తరాలు రాశారు. పెద్దయంత్రాన్ని నెలకొల్పకుండా చేయాలని శతవిధాలా ప్రయత్నించారు. వాటి పర్యవసానంగా బెంగ్రేలో ఆ పెద్దయంత్రం ఇంతవరకు నెలకొల్పబడలేదు. మత్స్యకారుల సంకల్పం దృఢమైనది; ప్రశంసనీయమైనది. సముద్ర రక్షణకు కలిసి కట్టుగా ముందుకు వచ్చారు.

– కాంచీ కోహ్లీ





# దుండగీడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించేకాలంలో బోధిసత్వుడు, దేవలోకంలోని దేవతలకు అధి పతి అయిన దేవేంద్రుడుగా వుండటం తట స్థించింది.

బ్రహ్మదత్తుడు అప్పుడు మంచి యౌవ నంలో ఉన్నాడు. రాజ్యాధికారం, తరగని సంపదలు, వీటితోపాటు మంచి వయసు తోడుకావడంతో అతనిలో క్రమంగా అహం కారం పెరిగిపోసాగింది. దాంతో ఎదుటివారిని ఏమాత్రం లెక్క చేసేవాడు కాడు. పూచిక పుల్లకన్నా హీనంగా చూసేవాడు. మంచీ చెడూ చెప్పేవారు లేకపోవడంతో అతనిలో అన్ని అవలక్షణాలూ చోటు చేసుకున్నాయి. దేవుణ్ణి కూడా పట్టించుకోకుండా కన్నూ మిన్నూ తెలియక ప్రవర్తించసాగాడు. అన్ని టికీ మించి వయసుమళ్ళిన జంతువులన్నా, మనుషులన్నా, పాతవస్తువులన్నా అతనికి ఎందుకో తగని ఏహ్యాభావం కలిగింది. అవన్నీ ఒక విధమైన రోతగా కనబడేవి.

వయసు మీరిన జంతువులేవైనా సరే- గుర్రాలు కానీ, ఏనుగులు కానీ, మరేవైనా కానీ కంటపడితే, వెంటనే వాటిని తరిమి తరిమి కొట్టేవాడు. పాతబడిన బళ్ళుకాని, ఇంకేదైనా వస్తువుకాని కనిపిస్తే చాలు, ఆ క్షణమే వాటిని ముక్క చెక్కలుగా చేసి పార వేసేవాడు.

వయసు గడచిన మనుషులు-అంటే వృద్ధులు ఎదుటపడితే, వాళ్ళ నెరసిన గడ్డాలు పట్టుకు లాగేవాడు. వాళ్ళను కింద పడుకో బెట్టించి పాత్రలు దొర్లించినట్టుగా దొర్లించే వాడు. ఆ వృద్ధులు స్త్రీలయితే, నానాహింసలూ పెట్టేవాడు.

బ్రహ్మదత్తుడు చేసే ఈ అర్థం లేని ఆట లకూ, దుండగాలకూ ఒక మితీ, మేరా లేక

జాతక కథ

పోయింది. ఇంద్రుడి లక్ష్యమూ, చంద్రుడి లక్ష్యమూ లేకుండా సంచరించే ఆ రాజ కుమారుణ్ణి ఎదిరించటానికి ఎవళ్ళకూ తరం కాలేదు.

ఇలా రాజు చేసే దుర్నయాలకూ, పెట్టే యాతనలకూ ప్రజలు కటకటలాడి పోసాగారు. చేసేది లేకతల వంచుకున్నారు. చాలా మంది గృహస్థులు వృద్ధులైన తమ తల్లి దండ్రులను రాజ్యం దాటించి ఇతర ప్రదేశాలకు చేర్చుకొన్నారు. ఈ విధంగా తల్లిదండ్రులను దూర దేశాలలో దిగబెట్టి, వారికి ఎడబాపులై వుండటం తప్ప మరి గత్యంతరం లేక పోయింది.




ఇలా ప్రజలు తల్లిదండ్రులను విడిచి పెట్టి ఉండటం వల్ల వారు మహాపాపం చేసిన వారయ్యారు. ఇటువంటి పాపాత్ములతో రౌరవాది నరకాలన్నీ నిండిపోజొచ్చినై. స్వర్గ లోకమంతా ఖాళీగా ఉండిపోయింది.

స్వర్గలోకంలో తగినంత పని కనబడక పోయేసరికి దేవేంద్రుడు విచారగ్రస్తుడయ్యాడు. దీనికి వెంటనే ఒకపరిష్కార మార్గం చూడాలని తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

దేవేంద్రుడు కడుపేద అయిన ఒకశతవృద్ధ రూపం దాల్చాడు. రెండు జాడీలలో మజ్జిగ నింపి, శిథిలావస్థలో వుండే ఒక బండిలో పెట్టాడు. ఆ బండికి రెండు ముసలి బక్క ఎద్దులను పూన్చి, బయలుదేరాడు.

ఈ విధంగా దేవేంద్రుడు వెళుతూండగా– అతి వైభవంగా గొప్ప ఊరేగింపుతో గజారోహణం చేసి వస్తున్న బ్రహ్మదత్తుడు ఎదురయ్యాడు. రాజుకోసం నగరమంతా ఆనాడు రంగురంగుల తోరణాలతో అలంకరించ బడింది! బండి మీద ముసలివాణ్ణి చూస్తూనే రాజు, ''పోరా, అవతలకి ముసలి పీనుగా! తప్పుకోరా! ఏమిటింత పొగరు?'' అంటూ కేకలు వేశాడు.

పక్కను ప్రజలకు ఇదంతా ఆశ్చర్యం కొలిపింది. 'ఏమిటి, రాజు ఇలా కేకలు వేస్తాడెందుకో!' అని అనుకొన్నారు. చిత్రమేమిటంటే–మారు వేషంలో వున్న ఆ దేవేంద్రుడు ఒక్క రాజుకే కనిపిస్తున్నాడు. కాని ప్రజలలో ఒక్కళ్ళకూ గోచరించటం లేదు. దేవేంద్రుడి మహిమ వల్లనే ప్రజల కళ్ళకు మాయ కమ్మింది!

అలా కోపంతో కేకలు వేసే రాజు మీదికి వేగంగా వెళ్ళి, వృద్ధుడు తన బండిలోని ఒక

మజ్జిగ జాడీ తీసి రాజు నెత్తి మీద పగల గొట్టాడు.

అనూహ్యమైన ముసలివాడి చర్యకు రాజు దిగ్భ్రాంతి చెందాడు. భయంతో ఏనుగుపై నుంచి కిందికి దూకి పారిపో జూశాడు. అప్పుడు ముసలివాడు వదలకుండా రెండవ జాడీ కూడా తీసి రాజు తలకు వేసి కొట్టాడు. ఆ మజ్జిగ ఒలికి రాజు వళ్ళంతా తడిసిపోయింది. రాజుకు ఏం చేయడానికీ తోచలేదు.

ఆ సమయంలో ముసలివాడు ఎక్కి వచ్చిన బండి అదృశ్యమైపోయింది. మజ్జిగ జాడీలు కనపడకుండా పోయినై. అప్పుడు దేవేంద్రుడు స్వస్వరూపంతో రాజు ఎదుట సాక్షాత్కరించాడు.

పాదాక్రాంతుడైన రాజును చూసి దేవేంద్రుడు, ''ఏమి రాజా! పొగరుబోతుతనము ఎవరికి? నీకా, నాకా? కన్నుకానని గర్వంతో ఎవరు మిట్టిపడుతూ వున్నారు? నువ్వా, నేనా? ఎల్లప్పుడూ ఈ యౌవనంలో ఇలాగే వుండిపోతావా నువ్వు? నీకు వృద్ధాప్యం రాదా? ముసలివారినీ, పాత వస్తువులనూ హేళన చేస్తావా? నీ దుశ్చేష్టల వల్ల రాజ్యంలో ప్రజలు ఎంత బాధపడుతున్నారో తెలుసుకున్నావా? నువ్వు పెట్టే యాతనలవల్ల వాళ్ళందరూ కన్న తల్లిదండ్రులను దూర ప్రదేశాలకు పంపివేసి, వారి రక్షణ చూడలేని మహాపాపులవుతున్న సంగతి కొంచెమైనా గుర్తించావా? ఈ విధంగా నరకలోకాలు నిండిపోవటం, స్వర్గానికి ఒక్కళ్ళూ రాకపోవటం గమనించావా? ఈ క్షణం నుంచి అయినా బుద్ధి తెచ్చుకొని, తప్పు దిద్దుకుని, సరిగా ప్రవర్తించు. లేకుంటే, ఇదుగో ఈ పిడుగు వచ్చి, నీ తలనూ, మొండెమునూ వేరు చేస్తుంది. జాగ్రత్త!'' అని హెచ్చరించి, అదృశ్యమయ్యాడు.

నాటి నుంచి బ్రహ్మదత్తుడి ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. అతడు వృద్ధులను గౌరవించసాగాడు. అందువల్ల ఇంతకుముందు రాజ్యంలో కలిగిన అలజడి తగ్గింది. ప్రజలు వాళ్ళ వాళ్ళ తల్లిదండ్రులను దూర ప్రాంతాల నుంచి తిరిగి తెచ్చుకొని, సేవించి సుఖంగా ఉంటూ వచ్చారు. బోధిసత్త్వుడి ప్రభావం వల్ల ఇంతటి మంచి మార్పు కలిగింది.





# రామాయణం

చెట్లూ, పొదలూ నరికి కీకారణ్యం మధ్యగా దారి చేసుకుంటూ రామలక్ష్మణులు జనస్థానం దాటి మూడు కోసుల దూరం వెళ్ళి క్రౌంచారణ్యం ప్రవేశించారు. వారు దారిలో మధ్యమధ్య విశ్రాంతి తీసుకుంటూ, దారి పొడుగునా సీతను వెతుకుతూ క్రౌంచారణ్యం దాటి మతంగాశ్రమ ప్రాంతం చేరి అక్కడ ఒక పెద్దగుహను చూశారు. అది చీకటి గుహ.

రామలక్ష్మణులు ఆ గుహ దగ్గరికి వెళ్ళేసరికి అందులో వారికి ఒక వికారమైన పెద్దరాక్షసి కనిపించింది. దాన్ని చూస్తేనే మామూలు మనుషులు దడుచుకుంటారు, అసహ్యపడతారు. పెద్ద నోరూ, పెద్ద కళ్ళూ, పెద్ద పొట్టా, కోరలూ, గరుకైన చర్మమూ గల ఆ రాక్షసి సింహాలనూ, పులులనూ పీక్కుతింటూ రామలక్ష్మణులను చూసింది. వెంటనే అది, పరిగెత్తుకుని, ముందు నడిచే లక్ష్మణుడి వద్దకు వచ్చి, అతన్ని పట్టుకున్నది.

అది లక్ష్మణుడితో, "నా పేరు అయోముఖి. ఇంతకాలానికి నాకు నచ్చినవాడవు దొరికావు. మనిద్దరమూ పెళ్ళాడి అరణ్యమంతా విహరించుదాం, నాతో రా!" అన్నది. లక్ష్మణుడికి ఆగ్రహం వచ్చి కత్తి దూసి దాని ముక్కూ, చెవులూ నరికేశాడు. అసలే వికారంగా ఉన్న ఆ రాక్షసి మరింత భయంకరంగా అయి, పెడబొబ్బలు పెడుతూ అరణ్యంలోకి పారిపోయింది. తరవాత వారిద్దరూ సీత కోసం ఆ వనమంతా వెదక నారంభించారు. ఇంతలో ఉన్నట్టుండి ఒక భయంకరమైన ధ్వని పుట్టి ఆకాశానా, దిక్కులా మారుమోగింది. రామ

అరణ్యకాండ – 7



లక్ష్మణులా ధ్వని వచ్చిన దిక్కుగా వెళ్ళి గుబురుగావున్న ఒక పొదలో ఒక వింత ఆకారాన్ని చూశారు. ఆ ఆకారం చిన్నకొండ ప్రమాణంలో ఉన్నది. నల్లగా ఉన్నది. దానికి తలా, మెడా, కాళ్ళూ లేవు. పక్షస్థలంలో ఒక పెద్ద కన్ను కాంతివంతంగా ప్రకాశిస్తున్నది. దానికొక పెద్దరెప్ప కూడా ఉన్నది. దానికి కిందుగా పొట్టలో పెద్ద నోరున్నది. మొండెం లాగున్న ఈ ఆకారానికి అతి దీర్ఘమైన చేతులు మాత్రం ఉన్నాయి.

ఈ వింత అవతారం కబంధుడనే రాక్షసుడు. అలా ఒకే చోట కదలకుండా ఉండి, అతి దీర్ఘమైన చేతులు చాచి, ఎంతో దూరాన ఉన్న జంతువులనూ, మనుషులనూ కూడా పట్టి భక్షిస్తూ ఉంటాడు.

రామలక్ష్మణులు తన ఎదుటికి రాగానే కబంధుడు ఇద్దరినీ చెరొక చేత్తోనూ బలంగా పట్టేసి, వేగంగా తన కేసి లాక్కోసాగాడు. ఎంతో బలమూ, ఆయుధాలూ ఉండి కూడా ఆ అన్నదమ్ములు ఎంత ప్రయత్నించినా వాడి చేతిపట్టు వదిలించుకోలేక పోయారు. లక్ష్మణుడు భయపడి పోయి, ''అన్నా, నన్ను వీడికి బలి ఇచ్చి నీ ప్రాణాలు కాపాడుకుని, వెళ్ళి సీతను వెతుకు!'' అన్నాడు.

రాముడు లక్ష్మణుడికి భయపడవద్దని ధైర్యం చెప్పాడు.

ఇంతలో కబంధుడు భయంకరమైన గొంతుతో, ''ఇద్దరూ బలిసిన ఆబోతుల్లాగున్నారు. మిమ్మల్ని విడవను. నా నోటికి చిక్కారు,'' అన్నాడు.

ఆ మాటలు వినగానే రాముడికి భయంతో నోరెండుకు పోయింది. క్షణం క్రితం లక్ష్మణుడికి ధైర్యం చెప్పినవాడు కాస్తా నీరు కారిపోయి, ''మన రోజులు బాగాలేవు. అన్నీ కష్టాలే. మన కిలాంటి ఘోర మరణం రాసి పెట్టి ఉన్నదికాబోలు. కాలం తీరితే ఎంతెంత మహావీరులు కూడా యుద్ధంలో చావటం లేదు?'' అన్నాడు.

అంతలో లక్ష్మణుడికి పరాక్రమం వచ్చేసింది. అతను రాముడితో, ''వీడు మనని తినటానికిసిద్ధంగా ఉన్నాడు. వీడి బలమంతా చేతుల్లోనే ఉంది. వీడి చేతులు రెండూ నరికేద్దాం!'' అన్నాడు.

కబంధుడీ మాటలు విని మండిపడి నోరు తెరిచి ఇద్దరినీ మింగబోయాడు. సరిగ్గా ఆ క్షణంలోనే రాముడు వాడి కుడిచేతినీ, లక్ష్మణుడు వాడి ఎడమచేతినీ నరికేశారు. ఆ దెబ్బతో కబంధుడు పెడబొబ్బలు పెడుతూ పడిపోయాడు. వాడు రామలక్ష్మణులను, ''మీరెవరు?'' అని అడిగాడు. లక్ష్మణుడు వాడికి తమ సంగతి చెప్పి, ''ఈ వింత ఆకారం గలనువ్వెవడవు? ఈవనంలో ఎందుకున్నావు?'' అని అడిగాడు.

''మీరిద్దరూ రామలక్ష్మణులా? మీరు ఈ అరణ్యానికి రావటం నాకు చాలా మంచిదయింది. నా కథ చెబుతాను వినండి,'' అంటూ కబంధుడు తన వృత్తాంతం వారికి ఇలా చెప్పాడు:

ఒకప్పుడు ఈ కబంధుడు ఇంద్రుడికి తీసిపోని దేవరూపం గలవాడు. అయితే అతను భయంకరమైన ఈ రూపం ధరించి వనాలలో ఉండే మునులను భయపెట్టుతూ





వచ్చాడు. ఇలా చేస్తూండగా ఒకసారి స్థూల శిరుడనే మహాముని తటస్థపడి, ''నీకీ రూపమే శాశ్వతంగా ఉండిపోవు గాక!'' అని శపిం చాడు. అప్పుడీ కబంధుడు మునికి క్షమాపణ చెప్పుకుని శాప విముక్తి ఎలాగని అడిగాడు. ''ఎప్పుడు రాముడు అడవికి వచ్చి, నీ చేతులు నరికి నీకు దహనక్రియలు చేస్తాడో అప్పుడు నీకు యథారూపం వస్తుంది,'' అని ముని చెప్పి వెళ్ళిపోయాడు. స్థూలశిరుడిచ్చిన ఈ శాపం అతి విచిత్రంగా ఫలించింది. శాపం తగలక మునుపే కబంధుడు బ్రహ్మను గురించి అతి దారుణమైన తపస్సు చేశాడు. బ్రహ్మ అతడి తపస్సు మెచ్చుకుని అతనికి దీర్ఘాయువు వరంగా ఇచ్చాడు. ''బ్రహ్మదేవుడు నాకు దీర్ఘాయువిచ్చాడు గనక నన్నిక దేవేం ద్రుడు కూడా ఏమీ చేయలేడు,'' అని గర్వించి, అతను ఇంద్రుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో అతని తలనూ, కాళ్ళనూ శరీరంలోకి తోసేసి మొండెం లాగా తయారుచేశాడు.

ఆ రూపంతో ఎలా బతకటం? అందుచేత అతను ఇంద్రుణ్ణి ఎంతగానో వేడుకుని తన ప్రాణాలు తీసెయ్యమన్నాడు. ''బ్రహ్మదేవుడు నీకు దీర్ఘాయువిచ్చి ఉండగా నేను నీ ప్రాణా లెలా తియ్యను? నేనాపని చెయ్యను,'' అన్నాడు ఇంద్రుడు. ''తిండి తినటానికి నోరు కూడా లేకుండా నేను దీర్ఘకాలం ఎలా జీవి స్తాను?'' అని కబంధుడు అడిగాడు.

అప్పుడింద్రుడు అతనికి అతి దీర్ఘమైన చేతులూ, కడుపులో పదునైన కోరలు గల నోరూ ఏర్పాటు చేశాడు. అతడికి కబంధ రూపం ఏర్పడింది. ముని శాపం ఫలించింది. ఆ తరవాత కబంధుడు అక్కడే ఉండిపోయి అందిన ప్రతి ప్రాణినీ తింటూ వచ్చాడు. కబంధుడీ కథంతా చెప్పినాక రాముడు, ''నా భార్య అయిన సీతను రావణుడనేవాడు ఎత్తుకుపోయాడు. అతని పేరు తెలుసే తప్ప, ఎక్కడ ఉంటాడో, ఎవడో, అతని శక్తి ఎటువం టిదో మాకు తెలియదు. అష్ట కష్టాలూ పడి సీతను వెతుకుతున్న మాకు నీబోటివాడు సహాయం చెయ్యటం భావ్యం,'' అన్నాడు.

దానికి కబంధుడు, ''నాకిప్పుడు దివ్య జ్ఞానం ఏమీలేదు. నన్ను మీరు దహించినట్ట యితే నిజరూపం పొంది మీకు చేతనైన సహాయం చేస్తాను, సలహా ఇవ్వగలుగు తాను,'' అన్నాడు.

రామలక్ష్మణులు ఒక పల్లపు ప్రదేశంలో చితి పేర్చి దానిపైన కబంధుణ్ణి పెట్టి దహనం చేశారు. కొద్దిసేపట్లో ఆ చితిని తోసుకుని ఒక దివ్యపురుషుడు స్వచ్ఛమైన బట్టలు కట్టుకుని, అనేక దివ్యాభరణాలతో పైకి వచ్చాడు. అతను హంసలతో అలంకరించబడిన విమానంలో కూచుని ఆకాశంలోకి లేచి రాముడితో ఇలా అన్నాడు:

''రామా, సీతను తిరిగి సంపాదించుకోవటానికిగాను నీకు ఒక వ్యక్తి సహాయం చెయ్యగలడు. అతడు కూడా నీలాగే రాజ్యాన్నీ, భార్యనూ పోగొట్టుకుని, అన్నభయం చేత పంపాసరోవర సమీపాన ఋశ్యమూకపర్వతం మీద నలుగురు అనుచరులతో ఉంటున్నాడు. అతను సుగ్రీవుడనే పేరు గల వానర రాజు, వాలి అనేవాడి తమ్ముడు, సత్యసంధుడు, సమర్థుడు, అద్భుత పరాక్రమశాలి. సీతను వెదకటానికి అతను నీకు సహాయ పడగలడు. నువ్వు ముందుగా అతని వద్దకు వెళ్ళి అగ్నిసాక్షిగా అతనితో స్నేహం చేసుకో. అతను కోరిన సహాయం చెయ్యి, అతని నుంచి సహాయం పొందు, అతని భటులైన వానరులు సీత ఎక్కడ వున్నదీ తప్పక తెలుసు కోగలరు.''

కబంధుడీ మాటలు చెప్పి, ఋశ్యమూకానికి వెళ్ళే మార్గం వివరించి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

సుగ్రీవుణ్ణి కలుసుకోవటం లక్ష్యంగా పెట్టుకుని రామలక్ష్మణులు పంపాసరోవరం కేసి బయలుదేరారు. వారు మర్నాటికి పంపా



సరస్సు యొక్క పడమటి గట్టు చేరుకుని, అక్కడ చెట్ల మధ్య అందమైన శబరి ఆశ్రమం చూశారు.

ఈ ఆశ్రమంలో మతంగమహాముని ఉండే వాడు. ఆయన వద్ద తపశ్శక్తిసంపన్నులైన శిష్యులుండేవారు. శబరి అనే సన్యాసిని శిష్యులకు సేవచేస్తూ తాను కూడా తపస్సు చేసింది. రాముడు చిత్రకూటానికి వచ్చిన సమయంలో ఆ మతంగ శిష్యులు ఐహికజీవితం చాలించి స్వర్గానికిపోతూ శబరితో, ''రాముడు నీ ఆశ్రమానికి రాగలడు. అతనికి చక్కగా అతిథి సత్కారాలు చేసి పుణ్యలోకాలు పొందు,'' అని చెప్పారు. వారు వెళ్ళినాక వృద్ధురాలైన శబరి రాముడి రాకకు ఎదురుచూస్తూ, వన్యాహారాలూ, ఫలాలూ అతని కోసం దాచి ఉంచింది.

శబరి రామలక్ష్మణులకు వందనం చేసి ఈ సంగతి తెలిపింది. రాముడి కోరికపై ఆమె రాముడికి తపోవనమంతా చూపింది. అక్కడ మునులు తమ తపశ్శక్తి చేత సప్త సముద్రాలూ సృష్టించుకున్నారు. వారి యాగవేదిక చెక్కుచెదరకుండా ఉన్నది. ఏనాడో ఆ మునులు కట్టిన పుష్పమాలలు వాడకుండా పరిమళాలు వెదజల్లుతూ నిలిచి ఉండటం రాముడు చూశాడు. ఇలా అక్కడి వింతలన్నీ చూపించి శబరి రాముడితో, ''ఇకనేను దేహం చాలించి నా యజమానులైన మహామునులను చేరుకుంటాను,'' అన్నది. తరవాత ఆమె అగ్నిప్రవేశం చేసి ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోయింది.

రాముడు ఆ వనం చూసి, అక్కడి సప్త సముద్రాలలో స్నానం చేసి, తర్పణాలు విడిచిన మీదట అతనికి మనశ్శాంతి కలిగింది, భవిష్యత్తు గురించి ఆశపుట్టుకొచ్చింది. అతను లక్ష్మణుడితో సహా ఆ ఆశ్రమం దాటి పంపాసరస్సుకు వెళ్ళాడు. దానికి సమీపంలోనే మతంగసరస్సున్నది. రాముడు అందులో స్నానం చేసి లక్ష్మణుడితో, ''లక్ష్మణా, ఈ సమీపంలోనే ఋశ్యమూకపర్వతం పైన సుగ్రీవుడుంటాడు. నువ్వు బయలుదేరి అతని వద్దకు వెళ్ళు,'' అన్నాడు.

[అరణ్యకాండ సమాప్తం]





# మాటపట్టింపు

వీధి కుక్కల అరుపులకు జానకయ్యకు మెలకువ వచ్చింది. ఆయన తలుపులు తీసుకుని ఇవతలికి వచ్చి, కుక్కలను అదిలించి, లోపలికిరాబోతూ, అరుగు మీదఎవరో ముడిచి పెట్టుకుని పడుకుని వుండడం చూశాడు.

''ఎవరు వారు?'' అన్నాడు జానకయ్య.

ఆ వైపు నుంచి జవాబు లేదు. జానకయ్య ఆ మనిషిని తట్టి చూశాడు. అతను చలికి గడగడలాడి పోతున్నాడు; ఒళ్ళు జ్వరంతో కాలిపోతున్నది. ''చలి ఎక్కువగా వుంది. ఒంట్లో బావున్నట్టు లేదు. లోపలికి వచ్చి పడుకో,'' అన్నాడు జానకయ్య. అతను అతి కష్టం మీద లేచి, జానకయ్యకు చేతులు జోడించాడు. జానకయ్య అతడికి చేతి ఆసరా ఇచ్చి, లోపలికి తీసుకువెళ్ళాడు. తరవాత చాప పరిచి, కంబళి కప్పి పడుకోబెట్టాడు. ఆ మనిషి మరుక్షణం నిద్రలోకి జారుకున్నాడు. అతన్ని గురించిన ఆలోచనలతో, జానకయ్యకు చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు.

ఎవరో తలుపు దడదడ బాదుతూండగా అతడికి మెలుకువ వచ్చింది. ఆ సరికే బారెడు పొద్దెక్కింది. ఆ వచ్చింది అతడి భార్య రత్నం. ఆమె ఆ క్రితం రాత్రి అదే ఊళ్ళో బంధువుల పెళ్ళికి హాజరయి, తెల్లవారుతూనే ఇంటికి వచ్చింది. ''ఇంతపొద్దెక్కేదాకా పడుకున్నావేం?'' అంటూ లోపలికి వచ్చిన ఆమె, చాప మీద కంబళి కప్పుకుని పడుకుని వున్న మనిషిని చూసి, ''ఎవరో వచ్చినట్టున్నారే! ఎవరు?'' అని భర్తను అడిగింది.

''ఏమో, ఎవరో!'' అని జానకయ్య జరిగిందంతా చెప్పాడు.

''అయ్యో పాపం! వేడి పాలిస్తే కాస్త తేరుకుంటాడు. మీరు అతన్ని లేపి మొహం కడుక్కోమని చెప్పండి,'' అంటూ ఆమె

25-ఏళ్ళనాటి చందమామ కథ



హడావుడిగా వంట గదిలోకి వెళ్ళిపోయింది. జానకయ్య ఆ మనిషిని లేపుదామని ఒంటి మీద చెయ్యి వేసి, ఉలిక్కిపడ్డాడు. రాత్రి నిప్పులా కాలిన అతని ఒళ్ళు ఇప్పుడు, మంచులా చల్లగా వున్నది.

"ఇతను పోయాడే!" అంటూ జానకయ్య ఒకవెర్రికేక పెట్టాడు. వంట గదిలోంచి రత్నం వచ్చి, "పోయాడా అయ్యో! ఇప్పుడేం చేద్దాం? అతని ఊరు ఏదో, అతని వాళ్ళు ఎక్కడ వున్నారో!" అంటూ లబలబలాడింది.

జానకయ్య ఆ మనిషి నడుం తడిమి చూశాడు. చేతికి గలగలలాడుతూ డబ్బు సంచీ తగిలింది. అతను ఆ సంచీ పైకి తీసి, కింద గుమ్మరించాడు. డబ్బుతో పాటు, ఒక ఉత్తరం కూడా కింద పడింది. అందులో ఇలా ఉన్నది:

"బాబూ, నారాయణా! నీకీ మధ్య జ్వరం కాస్తున్నదని, మన ఊరు మనిషి ఒకరు బజార్లో కనిపించి చెప్పాడు. ఇప్పుడు ఎలా వున్నది? ఇక్కడ నీ తమ్ముడి పరిస్థితి బాగా లేదు. కూతురు పెళ్ళికి మూడు వేల రూపాయలు ఎలా తేగలనా అని, వాడి బెంగ. చాలా మంచి సంబంధం. ఈ సమయంలో మీరు పాత స్పర్థలూ, మాటపట్టింపులూ మర్చిపోవాలి. రాధ పెళ్ళికి నువ్వు డబ్బు సాయం చేయాలి. పెద్దవాడివి కనక, తమ్ముడి విషయంలో నువ్వే సర్దుకుపోవాలి. ఈ ఉత్తరం అందగానే ఒంట్లో బావుంటే డబ్బు తీసుకుని బయలుదేరు. ఇక్కడ మేం మరో ఇంటికి మారాం. కొత్త చిరునామా రాస్తున్నాను. ఈ ఉత్తరం వెంట తెచ్చుకుంటే, ఇల్లు తేలిగ్గా కనుక్కోవచ్చు."

జానకయ్యకు సంగతి అర్థమైపోయింది. అతడు భార్యతో, "పాపం, తమ్ముడి కూతురు పెళ్ళికి డబ్బు తీసుకుని బయలుదేరి, దారిలో పోయాడు. ఈ ఉత్తరం వెంట వుంచుకోవడం మేలే అయింది! మనకు ఆ తమ్ముడి చిరునామా అయినా తెలిసింది," అన్నాడు.

"మీరు వెంటనే బయలుదేరి ఆ ఊరు వెళ్ళండి. వాళ్ళకు ఉత్తరం, డబ్బూ ఇచ్చేసి, సంగతి చెప్పి తీసుకురండి. మీరు వచ్చేదాకా నేను పెళ్ళివారి ఇంట్లోనే వుంటాను. ఇంటికి తాళం పెడదాం," అన్నది రత్నం.

జానకయ్య బాడుగ బండిలో రెండామడల దూరంలో వున్న నారాయణ తమ్ముడి ఊరికి బయలుదేరాడు. అతడికి ఇల్లు కనుక్కోవడం

కష్టమేం కాలేదు. కాని లోపలికి వెళ్ళబోతున్న అతను, లోపలి నుంచి వచ్చే మాటలు విని, గుమ్మంలోనే ఆగిపోయాడు.

''అమ్మా! డబ్బెక్కడా దొరకలేదు. ఇకనేను చేయగలిగిందేమీ లేదు. పెళ్ళివారికి మరో సంబంధం చూసుకోమని చెప్పేస్తాను,'' అంటు న్నారు ఎవరో. బహుశా, తమ్ముడు కాబోలు!

''అదేం మాటరా! చక్కటి సంబంధం, డబ్బుకు వెనకాడి వదులుకుంటామా? మీ అన్నయ్యకు డబ్బు తెమ్మని ఉత్తరం రాశాను. తప్పకుండా తెస్తాడు,'' అంటున్నది తల్లి.

ఆ మాటకు తమ్ముడు, ''నాకు చెప్పకుండా ఉత్తరం ఎందుకు రాశావు? అన్నయ్య డబ్బు చచ్చినా నేను ముట్టను. ఆ డబ్బుతో నా కూతురిపెళ్ళి చేసేది లేదు,'' అన్నాడు.

''చిన్న మాటపట్టింపుతో, మీ అన్నద మ్ములు పదేళ్ళుగా మొహాలు చూసుకోలేదు. రాధ పెళ్ళిలో అయినా మీరు కలుసుకుం టారని ఇన్నాళ్ళుగా ఆశపడ్డాను,'' అన్నది తల్లి బొంగురుపోయిన గొంతుతో.

జానకయ్య తలుపు తట్టి, ''నారాయణ తమ్ముడు గారి ఇల్లు ఇదేనా?'' అన్నాడు.

లోపలినుంచి నలభై ఏళ్ళ మనిషి తలుపు తెరిచి, ''ఎవరు మీరు? లోపలికి రండి?'' అన్నాడు ఆశ్చర్యపోతూ.

జానకయ్య లోపలికి వెళ్ళి కుర్చీలో కూర్చుని, డబ్బుసంచీ బల్లమీద పెట్టి, ఉత్తరం తమ్ముడు చేతికి ఇచ్చాడు. తమ్ముడు ఆ ఉత్తరం చదివి, ''ఇది, మా అమ్మ అన్న య్యకు రాసింది. తను రావడానికి మొహం



చెల్లక, అన్నయ్య డబ్బు పంపివుంటాడు. ముందు ఆ డబ్బు సంచీ, నా కళ్ళముందు నుంచి తీసేయండి!'' అన్నాడు కోపంతో.

''మీ అన్నయ్య స్వయంగా వద్దామనుకు న్నాడు; కాని రాలేకపోయాడు. మీరిద్దరూ కలుసుకోవడం మరి ఈ జన్మలో జరగదు,'' అంటూ జరిగినదంతా చెప్పేశాడు జానకయ్య.

తల్లి ఘొల్లుమన్నది. ఒక క్షణం ఆగి తమ్ముడు అరచేతుల్లో మొహం దాచుకుని, ''అన్నయ్యా, నన్ను క్షమించు!'' అంటూ ఏడ్వసాగాడు.

ఆ ఏడుపు చూసి జానకయ్య ఏమాత్రం జాలిపడకుండా, ''బతికున్న మనిషి విలువ తెలుసుకోవటం కష్టం. నీ మీద మీ అన్నకు ఎంత ప్రేమ లేకపోతే, ఒంట్లో బావుండక పోయినా, డబ్బు తీసుకుని బయలుదేరు

తాడు? నువ్వు సోదర ప్రేమకు ఇన్నాళ్ళూ దూరం అయ్యావు. ఇప్పుడది కోరినా దొర కదు,'' అన్నాడు.

ఆ ఇంటి శోకాలు విని ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు వచ్చారు. అంతలో, ''ఏమిటి దంతా? ఏం జరిగింది?'' అంటూ ఒక యాభై ఏళ్ళ మనిషి అక్కడికొచ్చాడు.

అతణ్ణి చూస్తూనే తల్లీ, తమ్ముడూ ఏడ్పు మాని నిర్ఘాంతపోయారు. తమ్ముడు అతణ్ణి సమీపిస్తూ, ''అన్నయ్యా, నువ్వు బతికే వున్నావా! నేను మూర్ఖుణ్ణి. నీ మంచిగుణం తెలుసుకోలేకపోయాను,'' అంటూ కాళ్ళు పట్టుకున్నాడు.

జానకయ్యకు ఆ వచ్చిన మనిషి తామింత వరకూ చచ్చిపోయాడనుకునే నారాయణ అని అర్థమైపోయింది.

సంగతంతా తెలుసుకుని నారాయణ నవ్వి, ''నేను డబ్బు తీసుకుని మొన్ననే బయలుదేరాను. రాధకు పట్టుచీర కొందా మని పట్నం బజారుకు వెళ్ళాను. అక్కడ ఒక ముసలాడు, దిక్కులేనివాణ్ణి, బిచ్చం అంటూ వెంటపడ్డాడు. జాలిపడి డబ్బు మూటపైకి తీసి, వాడికి ఒక రూపాయి ఇచ్చాను. నేను దుకాణంలో చీరలు చూస్తుండగా, వాడు నా వెనకే తచ్చాడుతూండడం, నాకు అనుమానం కలిగించింది. తీరా చీర తీసుకొని, డబ్బు కోసం చూసేసరికి, మొలలో దాచిన డబ్బు సంచీ లేదు. ముసలాడి కోసం తెగవెతికాను. వాడు కనిపించలేదు. మళ్ళీ ఇంటికి వెళ్ళి డబ్బు తీసుకుని, బయలుదేరి ఇక్కడికి వచ్చాను. మీ ఇంట్లో చచ్చిపోయింది, దొంగే అయియుంటాడు,'' అన్నాడు జానకయ్యతో.

''ఆ దొంగ చచ్చి మేలు చేశాడు. అతడి పుణ్యమా అని, అన్నదమ్ములు మళ్ళీ కలుసు కున్నారు,'' అన్నది తల్లి సంతోషంగా.

''ఇక నేను వెళతాను. ఇంటివద్ద జరగవల సిన పని చూడాలి,'' అంటూ జానకయ్య లేచాడు.

''వచ్చే నెల మా అమ్మాయి పెళ్ళి. మీ ఇంటిల్లిపాదీ తప్పకుండా రావాలి,'' అంటూ, అన్నదమ్ములిద్దరూ జానకయ్యకు వీడ్కోలు చెప్పారు.



చిత్రాలు: గాంధి అయ్య 21

# అజేయుడు గరుడుడు!

రాజగురువు సలహా ప్రకారం ఆలయంలో పూజలు నిర్వహిస్తున్న ఆదిత్యుడికి దైవానుగ్రహంతో అతీత శక్తులు పొందిన అనుభూతి కలిగింది. ఆలయాన్ని సూర్యపురి సేనలు చుట్టుముట్టాయి. సూర్యపురి సేనాధిపతి ధీరసేనుడు బలవంతంగా హద్దుమీరి ఆలయంలోకి జొరబడ్డాడు.

ధీరసేనుడు ఆలయం లోపల చిక్కుకు పోయాడు.

తలుపులు చాలా దృఢమైనవి! వాటిని తెరవడమే కష్టం. వాటంతట అవి ఎలా మూసుకున్నాయి? అతీతశక్తి కాదు కదా?

ధీరసేనుడు వెనక్కు తిరిగి చూశాడు.

నా సైనికులకు ఏమయింది? సుడిగాలిలో ఎండుటాకుల్లా ఎగురుతున్నారేమిటి? వాళ్ళకు ఏం జరుగుతున్నది?

సైనికులు తెలియని గమ్యం కేసి వేగంగా వెళుతూన్న వారిలా ఆలయం గోడలు, స్తంభాల చుట్టూ పరిభ్రమించసాగారు.


సైనికులు సుడిగుండంలాంటి పెద్ద అగాధంలోకి పడిపోయి, కనిపించకుండాపోయారు.


ధీరసేనుడు అవాక్కయి పోయాడు.
ఏమిటీ వైపరీత్యం! ఆలయ శిథిలాల మధ్య ఒంటరిగా మిగిలిపోయానా?


భయభ్రాంతుడైన ధీరసేనుడు వెలుపలికి వెళ్ళే మార్గం కోసం ఆలయంలోపల అటూ ఇటూ పరిగెత్తసాగాడు.
దారి అడగడానికి ఒక్కపిట్ట కూడా కనిపించడం లేదే! వెలుపలికి వెళ్ళడం ఎలా?


ఉన్నట్టుండి ఒక గుడి నుంచి తేజోవంతమైన రూపం తనవేపే రావడం చూశాడు.
ఆయన దివ్యపురుషుడిలాగున్నాడు! ఎవరై ఉంటారు?


ధీరసేనుడు ఆదిత్యుణ్ణి గుర్తుపట్టలేకపోయాడు.
నన్ను రక్షించు ప్రభూ! వెలుపలికివెళ్ళే దారి చూపించు.
ఎవరు నువ్వు? ఎందుకా తత్తరపాటు? ప్రశాంతంగా ఉండు!


నేను సూర్యపురి సేనాధిపతి ధీరసేనుణ్ణి. చంద్రపురి యువరాజు ఆదిత్యుణ్ణి వెతుక్కుంటూ వచ్చాను. నేనతన్ని చూడలేక పోయాను. నా సైనికులందరూ మటుమాయమైపోయారు!


ఆదిత్యుడితో నీకేంపని? నేనే ఆదిత్యుణ్ణి!
నేను అతన్ని... అతన్ని...


ఆదిత్యుడు గర్భగ్రిహం కేసి తిరిగి మొక్కాడు.
ప్రభూ! ఇతన్ని క్షమించు. ఇతని మీద కరుణచూపు!
ప్రభూ! నన్ను క్షమించు! క్షమించు!


పూజాకార్యక్రమాలను చూశాక, ఆలయ ప్రదక్షిణకు వెళ్ళిన శిల్ప కారులు, పనివాళ్ళు భగవన్నామం గానం చేస్తూ లోపలికి వచ్చారు. 'ఓం నమో నారాయణాయ' అనే దివ్యనామం వినిపించసాగింది.


రాజగురువును చూసి ఆదిత్యుడు అమితాశ్చర్యం చెందాడు.
మమ్మల్ని సైనికులు చుట్టుముట్టారు. కళ్ళుమూసుకుని మన వాళ్ళను భగవన్నామ కీర్తనం చేయమన్నాను. కళ్ళు తెరిచి చూస్తే సైనికులు కనిపించలేదు.


శిల్పకారులు, పనివాళ్ళు ధీరసేనుణ్ణి చుట్టుముట్టారు.
కరుణించి, నన్ను క్షమించండి.


ఆలయంలోపల అపరిచిత వ్యక్తి ఉండడం చూసి రాజగురువు ఆశ్చర్యపడ్డాడు.
నువ్వెవరు? ఇక్కడికి ఎలా వచ్చావు?
తమరినీ, ఆదిత్యుణ్ణీ బందీ చేయడానికి నేనిక్కడికి వచ్చాను.


గురుదేవా! మనకు చెప్పడానికి ఆయనవద్ద చాలా విషయాలు ఉన్నాయని భావిస్తున్నాను. మీరిద్దరూ మన శిబిరానికి వెళ్ళండి. నేను తరవాత వస్తాను.


శిల్పకారులకు
సూచనలిస్తూ
ఆదిత్యుడు ఆలయాన్ని
చుట్టి చూశాడు.


రాజగురువు అశాంతితో
ఉండడం ఆదిత్యుడు
గమనించాడు.
ఏదైనా సమస్యా
గురుదేవా?


ఆ భగవంతుడే మనల్ని రక్షించాడు.
ధీరసేనుడు దుష్టపథకంతో
ఇక్కడికి వచ్చాడు.
ఏమిటది?
అతడే నీకు
చెప్పగలడు.


ప్రధాన మంత్రి పుష్పరాజ్ నన్ను వజ్రపురికి పిలిపించాడు.
మీరు అక్కడ లేని సమయంలో చంద్రపురి మీదికి
దండెత్తాలని వాళ్ళు ఆలోచిస్తున్నారు. మిమ్మల్నీ,
రాజగురువునూ బందీగా పట్టుకు
పోవడానికి నేను ఇక్కడికి వచ్చాను.
అంటే, మేము లేనప్పుడు
చంద్రపురి మీదికి వజ్రపురి దాడి
చేస్తుందన్న మాట. మరి దానికేదైనా
కారణం ఉండాలి కదా?


రాజును గద్దెదించి,
మాజీ సేనాధిపతి కొడుకును సింహాసనంపై
కూర్చోబెట్టాలని కుట్ర పన్నుతున్నారు.
సూర్యపురి సింహాసనాన్ని నాకు
అప్పగించగలమని మాట ఇచ్చారు.


అందుకు మీ రాజు
నాకు మాట ఇవ్వాలి. నాతో రా,
మనం సూర్యపురికి వెళదాం.
యువరాజా!
నీకున్న దివ్యశక్తులను కళ్ళారా చూశానుగదా!
ఈ క్షణమే నీకు లొంగిపోతున్నాను. నేనెప్పుడూ తమ
సేవకుణ్ణే. సూర్యపురి రాజ్యం చంద్రపురితో ఎల్లప్పుడూ
స్నేహంతోనే మసలుకోగలదు.
నీ మాటలు
ఎంతవరకు నమ్మతగినవో
మేము తెలుసుకోవాలి కదా!

-(ఇంకావుంది)

మన వారసత్వ ప్రదేశాలు

# ఎలిఫెంటా గుహలు



మహారాష్ట్రలో బండలను తొలిచి మలిచిన గుహలు, ఆలయాలు చాలా ఉన్నాయి. ముంబైలోని సుప్రసిద్ధ భారత దేశ సింహ ద్వారానికి (గేట్‌వే ఆఫ్ ఇండియా) దాదాపు పది కి.మీ. దూరంలో అరేబియా సముద్రం ఎలిఫెంటా దీవిలో ఉన్న గుహలు అలాంటి వాటిలో ముఖ్యమైనవి. 1987లో యునెస్కో వీటిని ప్రపంచ వారసత్వ ప్రదేశాల జాబితాలోకి తీసుకున్నది.

అక్కడున్న ఒక ఏనుగు విగ్రహాన్ని చూసి కొందరు పోర్చుగీసు నావికులు 'ఎలిఫెంటా' అని దానికి పేరుపెట్టారు. గుహలలోని శిల్పాలు నాశనం కావడానికి కూడా వాళ్ళే కారకులు. గురిచూసి పేల్చడం అభ్యసించేప్పుడు వాళ్ళు శిల్పాలను గురి చూసి తుపాకీలు పేల్చేవారట!

ఈ గుహాలయ ప్రాంగణం దాదాపు 60,000 చ. అడుగులు విస్తరించి ఉన్నది. ఈ గుహలు దాదాపు 1500 సం.ల నాటివి. ఈనాటి మహారాష్ట్ర, కర్ణాటకలోని కొన్ని ప్రాంతాలను పాలించిన రాష్ట్రకూటులు సుప్రసిద్ధ త్రిమూర్తి రూపాన్ని తమ రాజచిహ్నంగా చేసుకున్నారు. కుడ్యాలలో ఉన్న శిల్పాలన్నీ దృఢమైన బండల నుంచి మలిచినవే.

ఏకశిలా ఆలయాలు చాలా వరకు పరమేశ్వరుడికి సంబంధించినవే. ఇక్కడి త్రిమూర్తి సదాశివ రూపం చాలా ముఖ్యమైనది. దీని ఎత్తు ఇరవై అడుగులు. కుడివైపు ముఖం యువకుడిలా మల్లె మొగ్గలాంటి దాన్ని పట్టుకుని ప్రసన్నంగా కనిపిస్తుంది. ఎడమవైపు ముఖం మీసాలతో రౌద్రంగా కనిపిస్తుంది. మధ్యలో ఉన్న ముఖం ధ్యానరూపంలో ప్రశాంతంగా కనిపిస్తుంది.

కొండలను తొలిచి నిర్మించిన మంటపాలుగల ఆలయ ప్రాంగణానికి మూడు ప్రవేశ ద్వారాలు ఉన్నాయి. ప్రధాన మార్గంలో శిల్పాలతో కూడిన ఇరవై స్తంభాలు ఉన్నాయి. ఆ మార్గం శివపురాణ ఘట్టాలను కుడ్యశిల్పాలుగా మలిచిన విశాలమంటపంలోకి తీసుకువెళుతుంది.

# వార్తలలో బాలలు



## బాలరచయిత

పదమూడేళ్ళ శ్రీచరణ్ గోపకుమార్ కాలిఫోర్నియాలో చదువుకుంటున్నాడు. అతడు ఏడవ తరగతి పూర్తి చేశాక మనదేశానికి చుట్టపు చూపుగా వచ్చాడు. ఇక్కడున్నప్పుడు పనిలో పనిగా పిల్లలకోసం రెండు పుస్తకాలు రాసేశాడు. ఒకటి మొక్కల గురించి; మరొకటి ఎడారుల గురించి. 'ఎయిడ్ ఇండియా' అనే ప్రభుత్వేతర సంస్థ ఆ పుస్తకాలను ప్రచురించనున్నది. శ్రీచరణ్ మూడు నెలల పసికందుగా ఉన్నప్పుడు అమెరికాకు తీసుకువెళ్ళారు. బెంగుళూరు నుంచి వెళ్ళిన అతడి తండ్రికి అక్కడ ఉద్యోగం లభించింది. పిల్లల కోసం వివిధ పథకాలను చేపడుతూన్న ఎయిడ్ ఇండియా సంస్థ గురించి తెలియడంతో శ్రీచరణ్ పుస్తకాలు ప్రచురించడంలో ఆ సంస్థతో చేతులు కలిపాడు. పిల్లల కోసం రచించిన ఈ రెండు పుస్తకాలు, వారికి తగ్గట్టు 'చాలా సులభంగా, సంభాషణ ధోరణిలో' ఉంటాయని శ్రీచరణ్ చెబుతున్నాడు.

## అతిపిన్నవయసు బిసిఎ పట్టభద్రుడు




శైలేంద్రకు పద్నాలుగేళ్ళే. అయితే అప్పుడే లక్నో విశ్వవిద్యాలయం బిసిఎ పరీక్షలను పూర్తి చేసేశాడు. అంతే కాదు. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. మొదట స్పెషల్ ఎగ్జామినేషన్‌కు హాజరుకావడంతో బిసిఎ పరీక్షలు రాయడానికి అనుమతించబడ్డాడు. అతడి పైచదువులకు విశ్వవిద్యాలయం ఆర్థికంగా సాయం చేయగలదని వైస్ ఛాన్స్‌లర్ డా. రాంప్రకాష్ సింగ్ తెలియజేశాడు. మరోవిశేషం ఏమిటంటే–శైలేంద్ర చెల్లెలు ఏడేళ్ళ సుష్మ హైస్కూలు పరీక్షలో ఉత్తీర్ణురాలయింది.

---

**చందమామ ఇండియా క్విజ్ – 7 (ఆగస్ట్ '07) విజేతలకు అభినందనలు:**

1. ఎస్. క్రిష్ణ, సూర్యాపేట – 508 213 (ఆం.ప్ర)
2. బి. పావనీశ్రీ, మచిలీపట్నం – 2 (ఆం.ప్ర)
3. ఎస్. హరి, మల్లెల పోస్ట్ – 517 370, చిత్తూరు జిల్లా (ఆం.ప్ర)
4. బి. భాగ్యరాజా, చిలకలపూడి పోస్ట్ – 521 002 (ఆం.ప్ర)
5. ఎస్. హరిణి, ముత్యంపేట పోస్ట్ – 505 831 కరీంనగర్ జిల్లా (ఆం.ప్ర)

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :

### పెరుగుతూన్న ఎవరెస్టు శిఖరం

ఒక వయసు వచ్చాక మనుషులు పెరగడం ఆగిపోతుంది. విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు ఇంత అభివృద్ధి సాధించినప్పటికీ ఇంకాస్త పెరగడానికి అవకాశం లేదు కదా అని పొట్టిగా ఉన్నవాళ్ళు వాపోవచ్చు. మనుషులు పెరగలేరుగాని, హిమాలయ ప్రాంతంలోని కొండ శిఖరాలు పెరుగుతున్నాయి.

ఎవరెస్టు శిఖరాన్ని మొదట పీక్-15 అని పిలిచేవారు. బ్రిటిష్ సర్వేయర్ జనరల్, సర్ జార్జ్ ఎవరెస్ట్ దాని ఎత్తును మొదట నమోదు చేశాడు. అందుకే అప్పటి నుంచి దానికాపేరు వచ్చింది.

దాదాపు ఆరు కోట్ల సంవత్సరాలకు పూర్వం ఏర్పడిన ఈ శిఖరం ఎత్తు 8,850 మీటర్లు. 1999 మళ్ళీ కొలిచినప్పుడు 15.5 సెం.మీ. ఎత్తు పెరిగిందని తెలియవచ్చింది.

నేషనల్ జాగ్రఫిక్ మేగజైన్ వెలువరించిన నివేదిక ప్రకారం ఎవరెస్టు శిఖరం యేటా 4 మి.మీ. ఎత్తు పెరుగుతున్నది. భూగర్భంలోని ఆసియా, ఇండియా 'టెక్టానిక్ ప్లేట్లు' కోట్ల సంవత్సరాలకు పూర్వం ఒక దానితో ఒకటి ఢీ కొనడం వల్ల, ఈ పర్వతాలు ఏర్పడ్డాయి. వాటి ఒత్తిడి కారణంగానే పర్వత సానువుల ఎత్తు పెరుగుతున్నదని విజ్ఞాన వేత్తలు అభిప్రాయపడుతున్నారు.

## మన పరిసరాలు

### పర్యావరణానికి మేలు చేసే పేడ




మన దేశంలో పేడ ఎరువును పంటలకు ఉపయోగించడం ఎప్పటి నుంచో వస్తున్నది. పిడకలు కూడా కొత్త కాదు. అయితే, పేడను ఎగుమతి చేసే విలువైన వస్తువుగా ఎప్పుడూ ఆలోచించలేదు. ఇంతకూ మన దేశంలో పశు సంపదకు కొరత లేదు. అయితే, డచ్ పశువుల పేడను పర్యావరణకు మేలుచేస్తుందని చెప్పి ఎగుమతి చేస్తున్నారు. దానికి 'ఎన్విరో డంగ్' అని పేరు కూడా పెట్టారు. మన దేశం కూడా దానిని దిగుమతి చేసుకోవడానికి ఆలోచిస్తున్నది.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని
వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



NARAYANAMURTHY TATA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు డిసెంబర్ 2007 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

ఆగస్ట్ నెల పోటీ ఫలితాలు
పావురాల సుజాత
భ.పే: పి. రాముడు
ఎల్.ఐ.సి. ఆఫ్ ఇండియా
కైకలూరు - 521 333
కడప జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : దేశం కోసం ఆడాలి!
రెండవ ఫోటో : స్నేహంతో ఎదగాలి!!

## సమాధానాలు :

1. నేతాజీ సుభాష్ చంద్రబోస్. 2. బెల్గాం, 1926.
3. సబర్మతి, 1916. 4. గోపాలకృష్ణ గోఖలే.
5. లార్డ్ ఇర్విన్, 1931.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)

CHANDAMAMA (Telugu) Oct 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08































